# పూ జా పు ష్ప ము

సుమనసమశోభనమూర్తు ల
సమానురాగమునఁ బ్రణయుజగ మేలెడి శ్రీ
రమణీరమణుల కీకృతి
సమర్పణముఁ జేసికొంటి సౌభాగ్యమునన్.

వెలయు భారతమున వింధ్యాద్రి, దానికి
దక్షిణమున వెలయు దండనగము,
దానిఁ జుట్టియుండు దారుణమరుభూమి;
దండగిరియె మనకథాస్థలంబు.

ప్రొద్దుంజాయుల వేలుపు
ముద్దియ యొక్కర్తు, తూర్పుమొగ, గగనముపైఁ
బ్రొద్దుపొడుపుము నొక్కనాఁ
డద్దెస నేతెంచుచుండె నవనీస్థలికిన్.

కటికిచీకటి మేలుకట్టు పందిళ్ళపై
వెన్నెలతీవలు విరిసినట్లు
నిద్దంపుమబ్బుల నీలిచేలములపైఁ
గ్రొమ్మించుపువ్వులు గురిసినట్లు
నవదమ్మిదోర యేలికొనుచాయ కురులపై
వానముత్తెపుసరుల్ వ్రాలినట్లు
మున్నీటితేరఁగల ముద్దుటుయ్యాలలపై
నక్షత్రకోటులు నడచినట్లు

కోనలు సాఁగి విరిసి గోళికలై ప్రాఁకి
కడలఁ దేరుగట్టి, కారుక్రమ్మి,
నిండి, నింగినెలఁత నెమ్మోనికాంతులు
పుడమి నద్భుతముగఁ బొడవుసూపె.
కానని వారలు, కాన
న్గానగు, గంగావతరణనాటక మిటు, గౌ
రీనాథుం డా శైలముఁ
గానంబడెనేని వేల్పుగఱితకు గుఱిగాన్.
తలఁపుల మెఱపో యనఁగా
వెలఁదుక భూమ్యంతరాళవీథిం దిగుచున్
దలపుఁల మెఱపులు మదిలోఁ
దలతల మెఱయంగ నిట్లు తలఁపందొడఁగెన్.
కసవు మొక్కకైనఁ గంటికిఁ గనరాదు,
చెట్టుచేమలమాట చెప్పనేల?
చిఱుదోమ యొక్కటైనఁ జెంగటఁ గనరాదు
చిలుకపక్షులమాట చెప్పనేల?
చలిచీమ యొక్కటైన సన్నిధిఁ గనరాదు
గొప్పజంతులమాట చెప్పనేల?
చప్పరం బొక్కటైనఁ జక్కటిఁ గనరాదు
చిగురుటిండులమాట చెప్పనేల?
చాఁపఱాతికొండలోఁతుల గుహ లొండుఁ
గాక వేఱు గానరాకయుండె,

నమరయోగి యుండు నాశ్రమమా యిది?
యనుచుఁ గాంత భూమి కవతరించి.
శ్రమముగ గుహాలోనికిఁ జని
సమాధినిష్ఠుఁ డగు నొక్క సంయమిచంద్రున్
విమలప్రేమానందుని
సమానసానంత తేజు నవలోకించెన్.
కని వాని తపోనిష్ఠకు
ఘన తేజంబునకు వెఱఁగుఁ గాంచుచు, ద్వారం
బున నిలిచియుండి, యాతఁడు
కను విచ్చినవెనుక మ్రొక్కి కామిని యనియెన్.
గంగ యొక్కటి లేదు గాని, యాఁదలమీఁద
సరికట్టు నిడువాలుజడలచుట్టు,
కాఁక క న్నొక్కటి లేకయున్నది గాని
నొసటఁ గన్పట్టు సిందురపుబొట్టు,
పాఁపపే రొకటి తోఁపదుగాని గళమునఁ
బొడకట్టు రుదురాకపూసకట్టు,
గజచర్మ మొక్కటి కానకున్నది గాని
కటిచుట్టుఁ గనవచ్చుఁ గావిపట్టు,
పూవుటమ్మువానిఁబోలుపెల్లఁ జెఱిచియు
మంచుకొండపట్టి మఱవలేక,
తపముసేయు శివుని తలఁపించునీకు నా
ధన్యవాదము లివె తాపసేంద్ర!

సారతరాత్మయోగమున
సంయమచిత్తుఁడవై సమస్తసం
సారము సారహీన మను
చొప్పున జానపదంబు వీడి కాం
తారములందు కర్కశోప
ఛంబుల నొంటిగ నుండి ప్రేమసం
చారము నేయు నీచరణ
సన్నిధిఁ గంటిని చూపసోత్తమా!
అన విని, యోగివరేణ్యుఁడు
మనమున నద్భుతరసంబు పల్లడిగొనఁగాఁ
దనలో నడంచికొని, య
వ్వనజాక్షిం గాంచి పలికె వాత్సల్యమునన్.
కలికి! యోగినివయి కన్పట్టుచుండితి
వెందుండి వచ్చితి విచటి కిపుడు?
పరు లెవ్వరును రాని మరుభూమి నేకాంత
వాసినై యున్ననావలన నీకుఁ
గాఁగలకార్యంబు గలదె? సర్వంబును
విడిచిన నా కేమి గొదవ లింకఁ?
పరమార్థ మొక్కటి పలికెద నీధన్య
వాదంబు లొల్లనివాఁడ గలఁడె?
గ్రాహ్య మది గాదు, పూర్వమర్యాద గాని
మరల నాశీర్వదింపనిమాట గాని.

28

వానితోడి నిమిత్తంబు వదలిపోయె
సకియ! యవియెల్లఁ బూర్వపక్షములు నాకు.

తనదగు కష్టమో సుఖమొ
దగ్గఱిజీవి కెఱుంగఁ జేయుటే
మనుజుని నైజ; మట్లగుట
మానవుఁ డొంటరిజీవి గాఁడు, నా
యనుభవ మట్లు గాక, నడ
యాడఁగరాని మనోరథంబుపై
నునిచిన దేవమూర్తి కయి
యుంచు నిదే విజనస్థలంబునన్.

ఈమనోరథ మొకచోటి కేఁగకుండ
జాఱినది కాలవారిధిఁ జక్ర మొకటి;
జీవసంకులరణ మింకఁ జేరరాక
విడిచియుంచితి దీని నీవిజనసీమ.

సారథి యేమి యయ్యెనో, య
సాధ్యపుగుఱ్ఱము లెందు చిక్కెనో
నేర నచింప; నానిలుచు
నిర్జనవాటికి నేఁటి కెవ్వరుఁ
రారు; పథంబు దప్పి యిటు
రావుగదమ్మ! ప్రపూజ్యురాల వే
తీరున గౌరవింతు నినుఁ
దీఱనివిస్మృతితీరవాసినై.

అతిథిమర్యాదలను మఱచితిని; సకల
లౌకికాచారములకు జలంబు లిడితిఁ
బొఱవైచితి మున్నె యాపరికరముల,
నే గృహస్థుఁడఁ గాను మన్నింపు మమ్మ!
అన విని యోగినీతిలక
మార్య సపర్యలు, సానుభూతిసాం
త్వనములు, గౌరవాదిబిరు
దంబులు నొందఁగవచ్చియుంటి నే!
విను మనియెల్ల వింగడపు
విత్తులు; వానికినై వివేకు లే
మనిమనసుంతు, రయ్యవి స
మస్తము వచ్చె, హితోక్తి చాలదే?
నే వచ్చితి నినుఁ జూడఁగఁ
గోవిద! జగదేకమాతఁ గొలిచెడిపని కం
తేవాసినులగు యోగిను
లీవాసంబునకుఁ బంప నెంతయుఁ బ్రీతిన్.
నీయున్నచోటు గంటిని
నీయున్నతభావములను నినుఁ గనుఁగొంటిన్
నాయుల్లము చల్లపడెన్
ధీయుత! నను వినుము కార్యదీక్షిత నగుటన్
భౌతికభోగభాగ్యముల
పోడిమిసిచింతఁ జేసి ... కొని

ర్ణితపథంబు జూసి, ధర
ణీస్థలిఁ బాసిననేను, యోగవి
ద్యాతిశయప్రభావమున
నూర్ధ్వజగంబుల కేఁగి, యోగినీ
వ్రాతముఁ జేరి మాతృపద
వారిజముల్ భజియింతునిచ్చలున్.
తనకూర్మి జగతి కంతకుఁ దల్లియై యొప్పు
నిఖిలేశ్వరిని గొల్చి నొగడు దానఁ
దనపేర్మి లోకసంతతి కొజ్జయై యొప్పు
కల్యాణిపదపూజఁ గ్రాలుదానఁ
దనలీల భువనభద్రత కూఁతయై యొప్పు
సర్వమంగళసేవ సలుపుదానఁ
దనఖేల విశ్వపాలన కెల్లయై యొప్పు
పున్నెంపుసతి నోముచున్నదాన,
వనజగర్భుని ఘనవేదవల్లిలోని,
వలిమలల్లుని సుజ్ఞానవల్లిలోని,
వనజనాభుని యానందవల్లిలోని
కుసుమముల లోకజనయిత్రిఁ గొలుచుదాన.
కానకయేని తెమ్మెరల
కౌఁగిలి కందని తావిపూలు, సుం
తేనియు నాలితుమ్మెదల
ముంగిలి సోంకని తేనెపూలు, సం

తానమనోజ్ఞపుష్పసము
దాయముకంటెను మేలిపూలు, నీ
కోన లభించునా జననిఁ
గొల్వఁగ? నా విని యోగి యిట్లనున్.
దగ్ధహృదయుఁడనైన నాతనువుపోలె
నామెలంగెడి యీమరుభూమి కూడ
నుగ్రసంతాపరూపమై యున్నయపుడు
కోన నా కేడ? పూవులగొడవ యేడ?
అని విరాగవృత్తి నాయోగి పలుకంగ
నాలకించి భావ మాకళించి
కనికరమున నతనిఁ గాంచి యాదర ముంచి
యమరలోకకాంత యనియె నిట్లు.
కాముని మదిలోనె కట్టిపెట్టితి గాని
వదలనివయ సేమి వ్రాలెనయ్య!
కోర్కె లేపొదిలోనొ గ్రుచ్చియుంచితి గాని
మఱవనిమన సేమి మాఱెనయ్య!
ఆస లేగుదిలోనొ యణఁచియుంచితి గాని
తిరుగని మన సేమి తీఱెనయ్య!
భావ మేగదిలోనొ పట్టియుంచితి గాని
మ్రొగ్గనివల పేమి తగ్గెనయ్య!
అనుభవమునఁ గాక యడఁగునే కర్మంబు
[illegible]

యొడలు చిక్కఁబెట్టి యుండెడిఫల మేమి?
యిట్టిముక్కుమూఁత లేఁటికయ్య?
అనుచుఁ గాంత వలుక, నంతరంగంబునఁ
గొంత చింత నొంది? కొంత కనలి,
తాను యుపశమిల్లి తాపసుఁ డిట్లను
భావభంగి కొంత బైటఁబడఁగ.
పరసతి వీవు, నిన్నుఁ గని
పల్కఁగ భావ్యముగాదు నాకుఁ, దీ
వరముగ నంతరంగమును
వ్రచ్చి కనుంగొనినట్లు మాటలం
జరపెదు; జీవి కేది యవ
సానమొ? కర్మము దేనియందు రూ
పఱునొ? నిరాశ పేరిటిత
పం బది గంటి నిదే వియోగినై.
మును జనకుఁ బరీక్షింపఁగఁ
జనుదెంచినసులభ వగుచుఁ జతురోక్తులఁ దో
నను జంకించెదు చెలువా!
జనకుఁ డగుట నాకు సులభసాధ్యమె! యనినన్.
అనఘ! జనకుండవైన నీ వగుదువేమొ!
కల్ల గాదు సులభను గాఁ జుమయ్య!
పుణ్యనిధులైన మీవంటి బుధుల కరుణ
కలిగె బ్రాహ్మణుండను దానఁ గాంచితిఁ గాని.

ఏదో! వియోగిశంచు వచి
యించెదు, దానికి నావిరాగమే
కాదొ ఫలంబు? దానికయి
గట్టినిరాశ ఘటింపఁజేయఁగా
రాదొ? నివృత్తిమార్గమున
రానిది కర్మము కాదొ? కర్మముఁగ
గాదన నేల? యీతపము
కర్మము కాదొ? తలంచిచూడుమా!
చంచలంబులు చర్వితచర్వణములు
భద్రరహితంబులును సుఖాభాసములును
నైన భౌతిక భోగభాగ్యములకొఱకు
భావమునఁ బ్రాజ్ఞఁ డెవ్వాఁడు పరితపించు?
నా విని తాపసోత్తముఁడు
నాతిఁ గనుంగొని పల్కె నిట్లు—నీ
భావము మోక్షమార్గమునఁ
బర్విడుచున్నది; ముక్తిమార్గమే
గావలెఁ నంచుఁ గోరుకొను
కర్కశచిత్తుఁడఁ గాను; ప్రేమసం
భావితభావలోకము త
పంబునఁ గాంచితి శాశ్వతంబుగన్.
ఉన్నది నిరాశ భౌతిక
మన్నది, యదియే నివృత్తి యగుటనె కాదా

మన్నది భావజగంబై
కన్నది ప్రణయామృతముగఁ గైకొనఁ గంటిన్.

వెగటు దోఁపఁగవచ్చు వీణానినాదంబు
విడువక నిరతంబు విందు వేని
చేదు దోఁపఁగవచ్చుఁ జిన్నిపూఁదేనియ
తిరుగక సతతంబుఁ దిందువేని
కుందు దోఁపఁగవచ్చుఁ జందురు నునుఁగాంతి
కదలక యనయంబుఁ గందువేని
అలసు దోఁపఁగవచ్చు నామనియందంబు
కొదుకక యేప్రొద్దుఁ గొందువేని
భౌతికంబు విరక్తికిఁ బ్రాపకంబు;
అమృతనాదంబు, దివ్యరసాయనంబు,
అమృత తేజంబు, దివ్యసిద్ధౌషధంబు
భావలోకంబు నిత్యసౌఖ్యావహంబు.

ఊరక నవ్వెనో? మఱేఁగి
యుండియునాజడదారిమాటలన్
జీరికిఁ దేక నవ్వెనొ? వ
చింపఁగ నేరముగాని, యంతలో
మాటిచి మోము, చిన్నెలకు
మానము దిద్ది, లతాంగివాతెఱం
జేరిచి తర్జనిన్, దపసి
చిత్తము నొత్తక యొత్తి యిట్లనున్.

తలఁగిపోకుండునే తళుకుల మెఱుపది
కనుమూయునంతలో గంతు వైచి,
మెనసిపోకుండునే యింద్రధను వ్వది
తిలకించునంతలో దివముఁ బాసి
కలసిపోకుండునే కళ లీను చుక్కది
పరికించునంతలో బాటఁ దప్పి
వాడిపోకుండునే వలపులపూ వది
వీక్షించునంతలో వృంత మెడలి
బాహ్యజగమున కది పరిపాటి యగుట
భావజగమున కదియె స్వభావ మగుటఁ
దలఁచి చూచియు నావినోదములకొఱకుఁ
బరితపించుట వట్టి విభ్రాంతి కాదె?
నావుడు నిట్టూర్చ్చుచు, దృఢ
భావంబునఁ దపసి వలుకుఁ బడఁతిం గనుచున్
నీ వన్నది, నాకన్నది
భావింపమిఁ, గనమిఁ గాదె పావనచరితా!
చూపులఁ దోఁచు నీజగతి
శూన్యము నశ్వర మందుగాక, నా
లోపలి క్రొమ్మెఱుంగులును,
లోపలి యింద్రధనుర్విలాసముల్
లోపలిచుక్క తళ్కులును,
లోపలి నాపువుఁగమ్మఁదావులున్

లోపలి దివ్యలోకపు వె
లుంగులుఁ జూచిన నట్టులందువే?
నాచందమామయందమ్ము చూతువు గాని
నే నున్న నింగిపై నిలువు మమ్మ!
నారత్నహారంపు నాడె మెంతువు గాని
నే నున్న కడలిపై నిలువు మమ్మ!
నారాజహంసిక నడక లెన్నుదు గాని
నే నున్న కొలనిపై నిలువు మమ్మ!
నా మించుఁగొ్రిందీవగో మెంచుదువు గాని
నే నున్న మబ్బుపై నిలువు మమ్మ!
పక్షకృశత లేదు, పార్థివంబును గాదు,
మానసంబు విడదు, మాయ గనదు,
దివ్యభావరూప తేజోజగం బది
నిలఁతు వమ్మ! చూడఁ దలఁతు వమ్మ!
నామనోరథకేతనంబున నలరారు
నాసువర్ణపదవిలోన మెంచి
నాయంతరంగవీణాస్వనంబునఁ దేలు
నారాగవృత్తవిహార మెంచి
నాహృదయనికేతనద్వారమునఁ గ్రాలు
నాదళపుటరూపకాపు లెంచి
నాభావసింహాసనస్థానమున వెల్గు
నాకృతిశుభమూర్తి నాకళించి

మించఁగలవేని తనకటాక్షాంచలములఁ
బ్రణయవిశ్వాస శాశ్వతపదవి నుంచి
భావసౌభాగ్యభారతీ భాగ్యలక్ష్మి
నీకు సాక్షాత్కరింపదే? నెలఁతమిన్న!
తాను యోగినియఁట! వియత్తలమునుండి
భూతలమునకు వచ్చిన ప్రోడయంట!
యోగి తనభావజగము రూపొందినట్లు
తెలుపఁ, జూడంగఁ దలఁపదే! వెలఁదిగాదె?
తాపసిపలుకులు తలఁ పూఁపఁ గాఁబోలుఁ!
దల యూఁచి యంతలోఁ దాల్మిఁ దాల్చు,
జడదారిమాటలు సరిదాఁకఁ గాఁబోలుఁ!
బులకించి యంతలో నిలుపరించు,
వనవాసియూసులు మన మొత్తఁ గాఁబోలు!
నిట్టూర్చి యంతలో నిమ్మళించు,
బైరాగిసుద్దులు పస నాటఁ గాఁబోలుఁ!
గంపించి యంతలోఁ గాలు ద్రొక్కు,
నబల తా నెంతయోగినియైన నేమి?
యూర్ధ్వజగముల వసియించుచున్న నేమి?
యావియోగిమనోయోగ మరసి యరసి
తెలిసి, తన్వియై, యెట్లు చింతింపకుండు?
యోగివరేణ్యుఁ డంత హృద
[illegible]

వేగము నాఁప లేమి నెద
విచ్చుటయుఁ, దదుపాసనాసుధా
సాగరసంభవప్రణయ
సారసనూతనచిత్రకాంతు లా
భూగగనాంతరాళమున
బోరన నిండి వెలింగె నంతటఁ
ఆవిమలాబ్జమధ్యమున
నద్భుతతేజముఁ బోడఁ దోఁచు దే
వీవరచిత్రమూర్తిఁ గడు
వెక్కసపాటునఁ జూచి చూచి, సం
భావనఁ జేసిచేసి, సుల
భంబుగనయ్యది స్వీయమూర్తిగా
భావమునఁ గ్రహించి సమ
భాగిని యోగిని లేచి యిట్లనున్.
ఈగైరికాంబరం బిటు పెట్టి, సన్నని
చలువ ధరింప నచ్చముగ నేనె!
ఈయవుఁదల జడ లిటు విప్పి, కురులకు
మెఱుఁగువెట్టంగ నమ్మికగ నేనె!
ఈరుదురాకల నిటువీడి, ముత్యాల
దండదాల్పంగ సత్యముగ నేనె!
ఈభూతిభస్మంబు నిటు వాపి, పసపార్చి
గంధ మలందెద నిక్కముగ నేనె!

తలఁప నామూర్తిదివ్యచిత్రంబు నేనె!
నాథునిహృదబ్జసింహాసనమున నేనె!
ఘనతరప్రేమపూజలఁ గంటి నేనె!
అతివలం దెల్ల ధన్యాత్మురాల నేనె!
మాఱిపోయెద నేమొ జాఱిపోవకుమమ్మ!
భగవతీ! ధాత్రి! నన్ బట్టుమమ్మ!
సోలిపోయెద నేమొ! తేలిపోవకుమమ్మ!
ఆకాశలక్ష్మి! న న్నరయు మమ్మ!
తూలిపోయెద నేమొ! తొలఁగిపోవకుఁడమ్మ
యోగినీసఖులు! న న్నోముఁ డమ్మ!
కరఁగిపోయెద నేమొ! కదలిపోవకుమమ్మ!
భువనమాతా! నన్నుఁ బ్రోవు మమ్మ!
పడఁతి నైయున్న నానోము పండెనమ్మ!
ప్రణయనంతానమునఁ బండువండె నమ్మ!
పతి ప్రణయదీక్ష నాలోనఁ బండెనమ్మ!
పట్టరానియానందంబు పండె నమ్మ!
కన్నులచీకటి విరిసెనో?
పున్నమవెన్నెలలు మేనఁ బొరసెనో? మెఱుఁగుం
గ్రొన్నన లెదలో మెఱసెనో?
మన్నను మి న్నెఱుఁగరానిమత మెఱుఱుఱున్,
నిలువలేక కరఁగి నీరయ్యె రోగిని
తూదిరూ, గంగ, యమున, త్రివేణిగాఁగ

బుణ్యనదులయూపుఁ బొందెనో! కాకున్న
వాని కంతమహిమ వచ్చునెట్లు?
కుప్పసంబు విడినకోడెనాగముభాతి
మబ్బు విడిన చందమామరీతిఁ
బ్రణయమానిమేనిఁ బాసి ప్రాణజ్యోతి
మెఱుఁగుఁబువ్వులీల మెఱసె నంత.
తెలివింటి లోకమాతకు
సరి కుత్తుక నెనఁగురత్నసరము లనంగా
మెఱుఁగుల వెన్నెలపువ్వులు
గుటికొని గ్రొమ్మించుఁదీవకోవల మెఱసెన్.
ఆవిశ్వమాతృమహాదేవిగళమున
హారంబు లైనవి తారలో, ఘ
నాఘనంబులఁ దోఁచు నవ్యతటిల్లత
లో, నూత్నకనకవిమానగతుల
విహరించు త్రిదశులవిమలనేత్రద్యుతు
లో, నిరతప్రణయానురాగ
నిశ్చితులగు ధర్మనిర్మలమూర్తుల
మహితపూజాపుష్పమాలలో, వి
శదఫణితిఁ దెలిసికొనుట శక్యమగునె?
తనివి దీఱఁ గనుట మనతరమె? వత్స
లత్వ మొనయు నాదేవిదౌ తత్త్వ మెఱిఁగి
మెలఁగి నొక్క జాతి భువనజేత [illegible]!

గణియింప నెంతప్రియమౌ నా
మము లుండఁగ, దివ్యభాగ్యము లుండఁగ, నా
ప్రణయంపుఁ జిన్నిపూవులై
గుణవల్లి జగంబుతల్లి కోరి ధరించెన్
ఓప్రణయప్రసూనములారా!
చూపట్టితి రాత్మభావశోభనలతఁ, బూ
జాపుష్పహార మైతిరి
మీపేరిమి లోకమాత మిమ్ము ధరింపన్.
నులిమంచువెన్నెలసోఁకుల కందని
పొత్తుల సరిక్రొత్తపూవులార!
ప్రొద్దుకెంజాయల ముద్దుల కందని
పొన్నారిపొందళ్లఁ బూవులార!
కమ్మనిగాడ్పుల కౌఁగిలి కందని
పొలపమ్మునెత్తావి పూవులార!
ఎలదేఁటికొదముల యెంగిలి కందని
పున్నెంపుఁ గ్రొందేనె పూవులార!
పురు డెఱుంగని కానుపుఁ బూవులార!
పుట్టి గిట్టని ప్రణయంపుఁ బూవులార!
భువనమాతను సేవించుపూవులార!
పుణ్యజగ మేలుఁ డెకేఁ బైఁడిపూవులార!
ప్రేమమయి యగు మాతృమూర్తి గళమందు
వా రిరువురుఁ బూజాపుష్పహార మైరి;

యెవ్వ రేపేట నున్నారొ యేర్పరించి
చెప్పఁడీ చూత మెవరైన నెప్పుడైన?
జగము లేలు ప్రణయజననికృపాలేశ
మింత గలుగఁ జూచినంతలోనె
యలరుఁగోనసీమ యయ్యెను మరుభూమి!
దండశైల మమృతకుండ మయ్యె!
మీసామీప్యము సౌఖ్యము,
మీసాలోక్యంబు ప్రేమమిళితము, శుభమౌ
మీసారూప్యము, మోక్షము
మీసాయుజ్యంబు ప్రణయమిథునములారా!

*

ఫ ల శ్రు తి :
పనదనమున కని గానీ
అనమున కని గాని చూడ కార్యులు సుగుణా
భ్యసనాసక్తుల శ్రుతులకు
రసాయనమొనర్తు రాదర సరసమూక్తిన్.
తల్లిదండ్రుల ప్రేమతత్త్వ మందినవారు
కన్నబిడ్డల ప్రేమఁ గన్నవారు,
కొలముపెద్దల ప్రేమ గుర్తెఱింగినవారు
తోడివారల ప్రేమఁ గూడువారు
ఆఁడుబిడ్డల ప్రేమ నందికోఁగలవారు
చుట్టాల ప్రేమను జూచువారు

అలుమగలప్రేమ సర్మిలిఁ గనువారు
చెలికాండ్రప్రేమ నీక్షించువారు
విశ్వమే ప్రేమగాఁ జూచి వెలయువారు
దేవదేవుని ప్రేమను దెలియువారు
ప్రేమయే జీవనంబుగాఁ బెరుఁగువారు
పరమపుణ్యపూజాపుష్ప మరయువారు.

## రా జ్య ల క్ష్మి

శ్రీసూక్తముగా నిది తల
పోసితినా, పురుషసూక్తముగఁ జేసితినా,
వ్రాసితి నాకృతి నీ వెటు
సేసిన సరె యింక నీదుచిత్తము శ్రీశా!
కలుములచెలికిఁ బురస్కృతి
మలరాయనికన్నియకు నమస్కృతి, పలుకుం
జెలువకు సత్కృతి యనఁగా
నిల మత్కృతి వెలయుఁగాక యిష్టార్థములఁగాం.
కథలు కథలు గాక కావ్యరూపములుగాఁ
బలుకుచుంటఁ గలదు భావసరణి,
కావ్యరూపములను గథలుగాఁ గథలుగాఁ
గావ్యసరణిఁ బలుకఁగ ఘనతే గాదె!

తేలికయును వాలికయును
పోలికయును జూపు పలుకుపొందిక తలఁ పైఁ
జీలిక తాలిక లేదఁగాఁ
గాలికముగఁ గథలు చెప్పఁగలుగుట యనదే!
తేలికమాటలు మెచ్చే
బాలకులకుఁ గాక మాకుఁ బస లేదనుచే
చాలును, జవి లేదనుచే
చాలును సరసు లగు వారు చదువరె! మొదలన్.
పుణ్యులు శౌనకాదులును,
పూతుఁడు సూతుఁడు, ధన్యులై మిశా
రణ్యము లేక యుండఁగఁ బు
రాతనగాథ యొకండు సెప్పఁగా
గణ్యత యుండునే యనరు
గా కథునాతను లైన మీరు సా
ద్గుణ్యము మీఱ నా తెలుపఁ
గోరిన సత్కథ నాలకింపరే!

* *

అనుక్రమణిక:
కల దరణ్యమందు కాసార మొకటందు
నిర్మలాంబువులను నిండియుండు
పథముఁ దప్పి యొక పథికుండు దప్పటఁ జేరి
శీతలాంబువులను సేద దీఱి.

సలిలవీచి నూఁచి, చలువలు గొని లేచి
లలితవాతపోతములు సెలంగు
గున్న పొన్ననీడఁ గోరిక లూనఁగూడఁ
బథికుఁ డధివసించి ప్రకృతిఁ గాంచి.
చిత్తమున నేమి యెంచెనో, చిత్రమునకొ?
యడవి గృహమని యెంచెనో, యాటకొఱకొ?
కూడఁ బాడంగ నెంచెనో, తోడుకొఱకొ?
యతఁడు రచియించె మంటిచే నాఁడుబొమ్మ.
మాటలే లేని యొకకొన్ని మంతనములఁ
బ్రొద్దుపోవంగఁ బాంథుఁడు వోయెఁ గాని
చిత్రముగఁ దన్నుఁ జేసిన సృష్టికర్త
మాటలాడింప నెఱుఁగ దామంటిబొమ్మ.
కంద దెండకుఁ, జీకటి డిందుపడదు,
గాలికెగురదు, వానకుఁ గరఁగఁబోదు,
అడవిలో నొంటి నుండుట కడలఁబోదు,
చెక్కు చెదరంగఁబోవ దాచిత్ర మేమొ!
మానవప్రాణి లేని యాకాననమున
నెన్నినా ళ్ళుండినను దన కేమిభయము!
బొమ్మ యెఱుఁగదు తనచెంతఁ బులులు పాము
లంతరాళంబునను బక్షు లాడుచుంట.
చూడంగా లేదులు, నడ
యాడంగాఁ గరులు, మాటలాడఁగ శుకముల్

పాడంగాఁ గోకిలములు
వీడంగా లేవు బొమ్మ వేడుక గనుచున్.
భువన మోహనమైన యాబొమ్మఁ జూచి
క్రూరమృగములుఁ బక్షులు గుంపుగట్టి
యనయమును జుట్టుఁ దిరుగాడు నంతె కాని
వెగటుఁదనమునఁ గీడు గావింపఁబోవు.

ఇట్టులు జరుగుచునుండగ
బట్టలవర్తకుఁ డొకండు పథ మెఱుఁగక, యా
నట్టడవిఁ బట్టిపోవుచు
నట్టే యాబొమ్మఁ జూచి యాశ్చర్యమునన్.
అమ్మా! త్రైలోకసుందరి!
యిమ్మాదిరి నగ్న వైతి వేమిటి కమ్మా!
కొమ్మా చీనాంబర మని
యమ్మగుదకుఁ గట్టె నొక్కయంబర మెలమిన్
కట్టి చూచె నతఁడు కన్నులు చల్లఁగా
మొదటికంటె హెచ్చె సుదతిచెన్ను,
వాఁడు మరలఁ జూచి వనలక్ష్మి గాఁబోలు
నంచు నెంచి మ్రొక్కి యరిగె నెటకొ?
తనమానముఁ గాపాడిన
మనుజునకుఁ గృతజ్ఞతానమస్కృతి దెలుపన్
మన మెఱుఁగదు జడముక్రియన్
మనుపుట్టువు జడము గాక మఱియేమి యగున్

అంబరధారిణి నవరూ
పంబున కచ్చేరువు నంది పక్షులు మృగముల్
సంబరముఁ దక్కి యూర్పా
టంబులు సేయంగ మాని, డాయ వెలచుచుఁన్.
కొన్నాళ్ళకు విధివశమున
సొన్నారి యొకండు కాన జొరఁబడి రాఁగాఁ
గన్నులఁ బడె నాసుందరి
త న్నాతఁడు మఱచి కొంతదడ వటు లుండన్.
ఆతఁ డామూర్తి యందంబు నరసి యరసి
స్వర్ణమణిభూషణంబులు సంతరించి
లలితమోహనరీతి నలంకరించి
యంగసౌందర్యలక్ష్మి నింపారఁ జేసె.
అంగరక్ష యయ్యె నాభూషణం బయ్యె
స్వర్ణకారుఁ డింత సాయ మయ్యె
సాధు సాధు వనుచుఁ జన విచ్చి పలుకదు
సిగ్గు గలిగెనేమొ! చిత్ర మేమొ!
జడమై పుట్టిన నేమీ
మడుగులు గట్టినది స్వర్ణమణివల్లరిచే
నోడ లలవరించుకొన్నది
పడఁతుక వనలక్ష్మి యనుచుఁ బలుకం దగదే!
నడయాడదు, పలుకాడదు
గడెగడె కొకవింతసొబగు గలుగు నదేమో!

విడిచియు విడువనిపువ్వులు
ముడిచియు నర్దైనలఁ దావి ముట్టినరీతిన్.
వాసరము లిట్లు చనఁగా
మాసంబులు చనఁగ వర్షమానము చనఁగా
భూసురుఁ డొక్కఁడు మాంత్రికుఁ
డాసీమకు వచ్చి దాని యుత్రమము గనుచున్.
భూతం బంతయు నెఱిఁగిన
యాతం డీవర్తమాన మరయఁడె భావిన్
జేతోవీథిఁ దలంపఁడె
ధాతకుఁ బ్రతి, బ్రాహ్మణుండు దక్కువవాఁడే!
తనువు నిచ్చినతఁడె, తనమాన మిచ్చిన
యతఁడె, యంగరక్ష యరసినతఁడె
ప్రాణ మిచ్చి, నాఁడె పలికించుకోరె! పా
లించుశక్తి తమకు లేదు గాక!
సుగుణుం డతఁ డిటు లెంచుచుఁ
ద్రిగుణాత్మకుఁడైన యాదిదేవువిక్రియ, న
వ్వగువ జననాదికంబున
కగుపురుషార్థము గ్రహించి యాదరమతియై.
చేసినట్టివానిచేతకు మెచ్చి, కై
సేసినట్టివారి వాసి మెచ్చి,
బొమ్మజడత మాన్పఁబూనిక మంత్రించి
ధరణిసురుఁడు ప్రాణదాన మొసగె.

పుట్టినపుడు, పుట్టంబు క
ట్టినపుడు, కాంచనంపుసొమ్ములు మేనం
బెట్టినపు డెటుఁగఁబో దా
పట్టి యిపుడు పలుకఁజొచ్చెఁ బ్రాణము చేరన్.

మంత్రమహిమఁ గంటి, మసలంగఁ గంటిని
భూతవృత్త మెల్లఁ బోల్చుకొంటి
గ్రూరమృగము లెల్లఁ జేరువవారైరి
యడవి పూజ్యరాజ్య మయ్యె నాకు.

తండ్రి యయ్యె నొకఁడు తనుధారణ మొసంగి,
భ్రాత యయ్యె నొకఁడు బట్ట లిచ్చి,
యాత్మబంధుఁ డయ్యె నంగరక్ష నొకండు,
పరమగురుఁడ వైతి ప్రాణ మిచ్చి.

వందనము సద్ద్విజుండా!
వందన మఖిలేశ మంత్రవరిష్ణుండా!
వందనము కృపాళుండా!
వందన మని లేమ విప్రవరుఁ బూజించెన్.

*

మాంత్రికాశీర్వాదము:

లక్ష్మిస్మరకాసారం బిది
లక్ష్మిని నీ విచటిరాజ్యలక్ష్మి
లక్ష్మిస్మరసనికృపఁ గాంతువు
సూక్ష్మంబు గ్రహించి పొందు శుభములు నిధిదున్.

పలుకులఁ జేఁతల భక్తిక
దలఁకొను చిత్తమున నిట్లు ధాత్రీసుర న
వ్వేఁలది వివిధార్చనంబుల
నెలమింపఁగఁ జేసి మఱియు నిట్లని పలికెఁ
కదలు టెఱుఁగని వెనుకటి కాలమాయెఁ
బొదలు టెఱుఁగని మునుపటిబొమ్మ వోయె
వంకయును జంకు లేకుండ నింకమీఁద
జీవయాత్ర నే నేరీతిఁ జేయుదాన!
అసువుల నీనిచో యుగయు
గాంతర మట్టులె యుండుఁగాని నా
కసువుల నిచ్చి మర్త్యగణ
మందొకదానిఁగనుండఁజేసి, మా
ననమున లేనిపోనిజత
నంబులు గూర్చితి వార్య! నాకు నీ
వసుమతి యేల? పాలనము
వచ్చిన, వచ్చెడిచావు దప్పునే?
ఆఁడుదానిచేతి యర్థంబు, మగవాని
చేతిబిడ్డ మనుట బ్రాఁతి యంద్రు;
అర్థసిద్ధి లేని యాయువు నాకేల?
నిండుగ్రుడ్డి కేల నెలవెలుంగు?
ఇయ్యెడఁ బాలనంబునకు
తెలిసియు నోహో జనించనొన్న నే

యయ్యల కిత్తు [illegible]
యుండెడివాఁడను గా[illegible], [illegible]
యయ్యలు లేరు, నీ వొకఁడ
వయ్యవు గానఁ బరిగ్రహింతురా
వయ్య! పరోపకారి వగు
మయ్య! ధరామర! నేఁడు క్రమ్మఱఁగా.
నావుడు ధాత్రీసురవరుఁ
డావెలఁదుకఁ జూచినవ్వి యఖిలాత్మక వో
దేవీ! నీ విటు లాడిన
భూవలయంబునకె లోటు పుట్టును గాదే!
సింగపుఁరొద బెదరెదవో? వి
హంగార్భటి కులికిపడెదవో? యనిలోద్ధతికిం
గ్రుంగెదవో? పర్జన్యాంభో
భంగంబుల భయముపడెదవో? పలుకుము దేవీ!
కరికుంభములమీఁది కురవడి నఱుకు కే
సరికి నీ విచ్చిన శక్తి గాక!
ఆశీవిషంబుల నలమి పైకొను తార్క్ష్య
పతికి నీ విచ్చిన బలము గాక!
ఘనతరువ్రాతంబుఁ బెనిచి కూలుచు మహా
బలున కీ విచ్చిన యలవు గాక!
యఖిలభూమండలం బంతలో ముంచు మే
ఘునకు నీ విచ్చిన పెనుపు గాక!

వేఱె యొక్కఁడి దమ్మ యీ విశ్వమందు
నాత్మశక్తి తలంప కిట్లుంటి గాక
నీబలము నీ వెఱుంగని నిన్నటివలె
నేఁడు గూడఁ బచింపఁగాఁ జూడ కమ్మ!
అయ్యలయ్యల కెల్ల నమ్మమ్మ వగుదు
వయ్య లేలే రఁటంచు నీ వాడె దేల?
భువనములు నీదుబొజ్జనే పుట్టె నన్న
దేవి! యీవిశ్వమాతవు నీవు గావె!
ఈవు చేయఁజనని దెవ్వరు చేయుదు
రర్థసిద్ధు లెల్ల నాశ లెల్ల
నిఖిలరక్ష సేయు నీయాజ్ఞలోనుండ
నాజ్ఞ లేని పరున కగునఁటమ్మ!
అసువుల నిచ్చితి నంటివె!
యసువుల నీఁగలుగువార లవనిం గలరే!
అసువులు వచ్చును గర్మా
వసరోపాధులను బట్టి వాలాయముగాఁ!
పుట్టినవారు గిట్టుటయె
పోలు! జగంబులు పుట్ట గిట్టనుం
బెట్టినయట్టినీకుఁ, బొర
పెట్టి పరాత్పరు నాత్మశక్తి చేఁ
గట్టినయట్టి నీకు, నవ్వుఁ
గా దననేరను గాని, సోకుఁ గ

న్పుట్టుట పుట్టువయ్యెనె? న
నాతనశక్తికిఁ బుట్టువున్నదే?
ఆకృతిఁ గూర్చిన యనఘాత్ముఁ డెఱుఁగునే
నీయనంతాకృతి నిఖిలమాత!
పుట్టంబు లిచ్చిన పుణ్యాత్ముఁ డెఱుఁగునే
నీమహామహిమంబు నిఖిలజనని!
సొమ్ములు వెట్టిన శుచిమంతుఁ డెఱుఁగునే
నీ దివ్యతేజంబు నిఖిలశక్తి!
పట్టంబుఁ గట్టిన ప్రకృతి యెఱుంగునే
నీజగన్నుతకీర్తి నిఖిలమూర్తి!
కలసి యేనాఁడుఁ బరులకుఁ గానరాక
తిరిగి యేనాఁడుఁ బెఱవారి కెఱుఁగరాక
నిగమమంత్రార్థసంసిద్ధి నేఁడు నాకు
నాదరంబునఁ బ్రత్యక్ష మైతి గాక!
అఖిలలోకమహాలక్ష్మి వైన నిన్ను
నే నుపాసించి కొలిచిన నియతి మెచ్చి
నాకుఁ బ్రత్యక్షమైతివి లోకమాత!
వర మొసగు మమ్మ! నీవ యీ వసుధ నేలఁ
నీవు సనాతనశక్తివి
దేవి! నీయాజ్ఞ క్రిందు తిరుగున్నదె! నీ
సేవలె నందువు గానీ
నావశమా రాజ్యపాలనం బొనరింపన్.

గద్దెపొంత వసించి పద్దాడఁగలఁ గాని,
రాజ్యంబు సేయఁగా రాదు నాకు,
తేరుచెంత వసించి తీరాడఁగలఁ గాని,
కయ్యంబు సేయఁగాఁ గాదు నాకు,
ఓలగంబున నుండి మేలాడఁగలఁ గాని
కట్టడ సేయఁగాఁ గాదు నాకు,
చౌకంబునం దుండి చదురాడఁగలఁ గాని
కానుకబిసు దీయఁ గాదు నాకు
వలఁయు నుపదేశ మీయఁగాఁ గలను గాని
ప్రాభవము లేని నా కేల పాలనంబు
రాజరాజేశ్వరివి నీవె తేజ మెసఁగ
నీభువనపూజ్యరాజ్యంబు నేలు మమ్మ!
నా విని మానినీమణియు
నంతగుణానుభవప్రపూర్ణయై
జీవగణప్రకీర్ణమగు
సిద్ధజగం బఖిలంబునై జనా
యావరణంబులోని దగు
టాత్మ నెఱింగి, ప్రసన్నచిత్తయై
యానసుధామఃప్రవరు
నారసి ప్రాభవ మొప్ప నిట్లనున్.
తెలిసిన దార్యవర్య! భవ
దీయసమంచితసత్యబోధ; నీ

పలికినపల్క మోఘ మని
ప్రస్తుతి సేయఁగ నేల? మున్న ధీ
బలమునఁ బ్రాభవంబునకు
భావిచరిత్ర శుభోదయంబుగాఁ
బలికిన దైవవాణులకు
పాయనమే కద నీ మృదూక్తియుఁ
నిజమున కొప్పుకున్న నవి
నీతియగున్, మఱియొప్పుకొన్నచోఁ
బ్రజ కది తోఁచు గర్వమను
భావముగా, నటుగాన సత్క్రియా
విజయముచేతఁ బ్రాభవము
వెల్లడి సేయుట ధర్మమంచు నా
ర్యజనులు పల్కుచుందు రది
యా దరణీయముగా దెయెయ్యెడన్.

అతఁడే సచివుండగు, హితుఁ
డతఁడే యగు, నాత్మబంధుఁ డాతండె యగున్
మతిమంతుండై గురుఁడై
పతికిఁ బురోహితుఁడునైన పండితుఁ డనఘా!

దివ్యులగు గురుభార్గవదివిజమునులు
భవ్యులైన వసిష్ఠాది పరమమునులు
సచ్చరితులైన ధౌమ్యాది సాధుమునులు
పతికి హితబంధు గురుపురోహితులు కారె!

యోగనిద్ర నున్న యోగేశ్వరిని నన్ను
మేలుకొలుపుఁ బాడి మేలుకొలిపి
జ్ఞానముద్రలోన సర్వంసహాభార
భరణ మొనఁగినావు భవ్యమూర్తి!
నీకంటెను హితు లెవ్వరు,
నీకంటెను సచివు లెవరు, నీకంటె గురుల్
నీకంటె నాత్మబంధులు
మా కెవ్వరు గలరు భువనమండలి ననఘా!
మాకుఁ బురోహితుండవయి
మాయవనీభర భారకార్యముల్
చేకొని నేఁటినుండి పని
సేయుదు గాక! మదీయశాసన
శ్రీకరమూర్తివై ప్రజల
సేమమె నిత్యముఁ జూతుగాక! సౌ
ఖ్యాకర మౌను గాక వసు
ధామరనంతన! నీకు నెల్లెడన్.
వృత్తియుఁ, గలిమియు, ధనమును
బెత్తనమును దీనఁ బేరువెంపులు గలవం
చెత్తె ఱఁగునఁ బలుకుదు! లో
కోత్తర చరితునకు నీకు నురుగుణజలధీ!
అసిధారావ్రతశక్తిగా
మసలం గలవాఁడ వౌట, మా హితమునకై

వసుధావసమున నీకున్
బసదన మీవలయు ననుట భావ్యము గాదే!
నా విని మందస్మితుఁడై
యావిప్రుం డిట్టు లనియె, నమ్మా! నీయా
జ్ఞావర్తి నగుదు నైనన్
నావిన్నప మున్న దది వినందగు మొదలన్.

ఆర్తి యెఱుంగని విభవ
స్ఫూర్తిం బ్రాపించి శాంతిశోభావిలస
న్మూర్తు లగు ప్రభులఁ గొలిచెడి
కీర్తియె పసదనము మాకు కళికల్మషచరితా!

సంయమీంద్రునకైన సంసారికైనఁ
గీర్తిధన మిందు నందును గ్రిందుపడక
శాశ్వతం బగు పుష్టి నొసంగుఁగానఁ
జిరయశోధన మొకఁడె వాంఛితము మాకు.

ఉన్నది పుష్టి మనుజునకుఁ
దిన్నది పుష్టి పసి కనెడి దేశపునుడి ము
న్నున్నది గాదా విన్నది,
కన్నది గాదమ్మ! పలుకుకందువసుమ్మా!

శుద్ధసువర్ణాత్మసుకృతి యున్నది మాకు
నెత్తె నేమిటి కమ్మ! వృత్తిమాట,
పరమపావనపదభాగ్య మున్నది మాకుఁ
దలఁప నేమిటి కమ్మ! కలిమిమాట

యన్యదుర్లభసరసార్థ మున్నది మాకుఁ
దనవ నేమిటి కమ్మ! ధనముమాట,
మాన్యంపుఁ గవులసంపత్తి యున్నది మాకుఁ
బలుక నేమిటి కమ్మ! పదవిమాట,
యున్న దని చెప్పి కొంట గర్వోక్తి గాక
యమ్మదయ యున్నదనుటకే యర్థ మమ్మ!
జనని! నీసత్కటాక్షపరిసారమహిమఁ
గన్న మాకొండుకొదవ యే మున్న దమ్మ!
ప్రాభవం బున్నది పాలింపఁగా మీకుఁ
బలు కున్నయది మాకు బలముకొలుప
దొరతనం బున్నది బిరుదు వల్కఁగ మీకుఁ
గళ యున్నయది మాకుఁ గాలు నిలుప
భూతలం బున్నది ప్రోదిసేయఁగ మీకుఁ
దప మున్నయది మాకు దళము గూర్ప
నభిమాన మున్నది యాదరింపఁగ మీకుఁ
జన వున్నయది మాకు సంతరింప
మన్న దని చెప్పికొంట గర్వోక్తి గాక
తరతమవిభాగ మొనరించుసరణి గాక
పాలనం బనుబంగారుబండి నడుపఁ
బ్రాణచక్రంబు లను ద్రిప్పు పగిది గాదె!
నీవు మహారాజ్ఞీమణి
నై విశ్వము నేలుచుండ నర్హ [illegible]

మావంటివారు కొలువున
దీవించుచు నుండి సదుపదేశము లొసగన్.
గురుపదమున మ మ్మిుంచిన
గురుమతి వీ వెఱుఁగనట్టి గుణధర్మము లే
దరయఁగ వచింతు నై సర్గ
బరమకరుణ వినుమటంచు బ్రాహ్మణుఁ డనియెన్.
నీతోడునీడగా నిలిచియున్నది గదా
మృగరాజు బోనులో నిడకుమమ్మ!
యడుగు దాఁటకయుండ నడయాడినది గదా
కరిరాజుఁ గంబానఁ గట్టకమ్మ!
యుక్క సోఁకక యుండ ఱెక్కార్చినది గదా
విహగరాజును గూఁట వేయకమ్మ!
మిడిమిడిఘొండకుఁ బడగెత్తినది గదా
ఫణిరాజుఁ బుట్టలో నణఁపకమ్మ!
ప్రాభవవినోదములమాట పాటిగొనక
యుపకృతిఁ దలంచి జీవుల కుపచరించి
విశ్వజనయిత్రి వనుమాట విస్మరింప
కీభువనపూజ్యరాజ్యంబు నేలుమమ్మ!
కారంబు బ్రింగ నోంకారం బెఱుంగునే
గోరువంకమాటలఁ గొనకుమమ్మ!
పంచమసిద్ధిఁ బ్రపంచ మెఱుంగునే
కలకంఠిపాటలఁ దలఁపకమ్మ!

ఫల సమాహారతఁ బరమార్థ మెఱుఁగునే
చిలుకప్రాసుడి పాటిసేయకమ్మ!
యమలతావిస్ఫూర్తి నాత్మ యెఱుంగునే
కలహంస నడవడిఁ బలుకకమ్మ!
ప్రభులు చారచక్షువులను పలుకె కొనక
స్వాత్మచక్షువులను మాట సార్థకముగ
విమల ధర్మాభిరక్షఁ గావించుపొంటె
నీభువనపూజ్యరాజ్యంబు నేలుమమ్మ!
సాగరేశ్వరి రత్నసౌధంబుఁ గట్టించెఁ
బ్రియము మీఱ సమాదరింతు గాక!
పర్వతేశ్వరి మణిప్రాకార మెత్తించెఁ
గృప మీఱ నంగీకరింతు గాక!
క్షితితలేశ్వరి స్వర్ణసింహాసనముఁ గూర్చెఁ
బ్రేమ మీఱఁగ స్వీకరింతుగాక!
భూతీశ్వరి విహారపుష్పకం బొనరించె
నెలమి మీఱఁ బరిగ్రహింతు గాక!
స్వాంశుమంతు లెల్ల సామంతులై యిట్లె
ప్రాభవంబుఁ గూర్చి భక్తి మీఱఁ
జిత్త మెఱిఁగి నిన్ను సేవింపఁగాఁ బ్రజా
రక్షఁ గూర్తుఁ గాక రాజ్యలక్ష్మి!
కాసారలక్ష్మియే కదలి వచ్చిన దమ్మ
సర్వేశ్వరున కర్ఘ్యసమయ మనుచు.

నారామలక్ష్మియే చేరవచ్చినదమ్మ
విశ్వేశ్వరుని పూజవేళ యనుచు,
కేదారలక్ష్మియే కేరి వచ్చిన దమ్మ
భువనేశు నర్చించు ప్రొద్దటంచు,
గోకులలక్ష్మియే కోరి వచ్చిన దమ్మ
పరమేశు సేవించుతరుణ మనుచు,
భువనలక్ష్మియె చాటింపఁ బూనెనమ్మ
నిఖిలరక్షకుఁ గీర్తించునిమిష మనుచు
శుభసమయ మయ్యె నఖిలేశు శ్రుతిహితముగ
భక్తిఁ బ్రణుతింతు రావమ్మ భాగ్యలక్ష్మి!

*    *

మఱుపడినది కొఱపడినది
తెర పడినది ముందు నీకుఁ దెలుపఁగవలెనా
మెఱుఁగవె? నను మన్నింపఁగ
నెఱుఁగవె? నావలన వినుట కెఱుఁగవె శ్రీశా?

# క్షీరసాగరమథనము

అపేక్షారిక:

శ్రీపతులను సంస్మరించి, నుతించి,
విఘ్ననాయకుల భావించి, సేవించి,
దాసాను దాసులఁ దలఁచి, చింతించి,
ప్రకృతి పురాణసారము సంగ్రహించి
పాలేటిమథియించుపట్టుఁ గన్గొంటి
కనివిని యెఱుఁగనికథఁ జెప్పఁబూంటి,
చెవియిచ్చి వినరయ్య! శివభక్తులార!
ఆలించి వినరయ్య! హరిభక్తులార!
శ్రీ కానపడి మ్రొక్కు చెల్లించుకోరె
ఆనాఁటి సుకవుల కది జీవమైన?
ధీ కానపడి మ్రొక్కు తీరిచికోరె
యీనాఁటి సుకవుల కిది భావమైన?
వారికి వీరికి వ్యంజనంబైన
తలఁపుల పాలేటి తరివెన్న యిడుదుఁ
జెలిమిచేఁ గొనరయ్య! శ్రీమంతులార!
తెలివిచేఁ గొనరయ్య! ధీమంతులార!
జగదీశ తత్త్వంబుఁ జదివినకవులు,
ప్రకృతితత్త్వంబును బాడినకవులు,
నేఁడును నాఁడు నెన్నికఁ గన్నకవులు,
తడవ రేమూలంబుఁ దమకావ్యకథల,

అమూలగాథాసుధాసారపూర
మనుభవజ్ఞుల కెల్ల నమృతోదకముగ,
సుకృతిమూర్తుల కెల్ల శుద్ధోదకముగఁ
గల్పింతుఁ దత్కథాక్రమ మెట్టి దనిన:
క్షితిదైత్యకులమునఁ జెన్నొందువారు,
అతిబలాఢ్యులు, బలి హాలి యనువారు,
చెవి సోఁకఁగానీరు శ్రీవిష్ణు పేరు
భవభక్తు లని పేరు వడసినవారు
హరిసిరి నెటులైన హరియింప నెంచి
హరుని చే వరముల నందఁ దలంచి
ఉరునిష్ఠ వింధ్యాచలోత్తరశిఖరిఁ
జిరకాలము తపంబుఁ జేసిరి వారు.
దానవ వరు లిట్లు దారుణభంగి,
తపము సేయఁగ వారితనువులఁ బొంగి
పావకజ్వాల లుప్పరమున కెగసి,
చద లాక్ర మించి భూచక్రంబుఁ గప్పి,
జీవసంఘంబులఁ జీకాకుపఱుపఁ
బరమేష్ఠిపంపున భాగవతుండు
కలహాభోజనుఁడు నిక్కపుహితుఁ బోలి
దితిజుల దర్శించి దీవించి యనియె.
"చిఱుతప్రాయమునాఁడె శివుని మెప్పించి
వీరభద్రునిఁ గూడి విశ్వాంగణమున

దక్షునియజ్ఞంబు ధ్వంసం బొనర్చి
వీరయుద్ధంబున విష్ణుఁ దిట్టించి
దివ్యమునీంద్రుల దేవసంఘములఁ
బలుపాట్లఁ బెట్టించి ప్రౌఢిఁ గాంచితిరి;
ఈరేడు జగముల నీ డేది మీకు?
దానవపతులార! తప మేల మీకు?”
“మును రమణాచలంబునఁ దపం బుండి
కెరలి యగ్గిరి తలక్రిందు చేసితిరి;
చంద్రమండలమున జపము గావించి
జీవన మచట శుష్కింపఁ జేసితిరి;
సూర్యమండలమును జొచ్చి యచ్చోట
విధి విప్లవాంగారవృద్ధిఁ గూర్చితిరి;
మీతపోబల మప్రమేయము గాదె!
జగమేలుకొనుఁ డింక, జప మేల మీకు?”
నావిని, బలి నవ్వి నారదుఁ గాంచి,
“వలను గాంచిన భాగవతశిఖామణివి,
నాఁ డాడితివి కదనము పురివెట్టి,
నేఁ డాడెదవు మమ్ము నిపుణులుగాఁగ,
వీరభద్రుం డేల?. విగ్రహ మైన
మాశక్తి చాల దే!—మఱచిపోయితివె?
వైకుంఠపతి వీడి వచ్చిననాఁట
భయమునతో మాదెన్నఁ బాడినపాట!

మముఁ దెల్పితివి, మేలుమాట లాడితివి,
మరలిపోవుదుగాక! మరియాడఁ దలఁచి,
కైలాసనగముపై ఘనయోగనిద్రఁ
గనుమోడ్చియున్న ముక్కంటి మేల్కొల్పి
మరలిపోనేర్తువే—మాను మీసడత,
లావిష్ణుసిరి కొల్ల లాడినదాఁకఁ
ద్రిభువనలక్ష్మి వరించినదాఁక
దప మేల మానుపఁదలఁతు? మునీంద్ర!
ఉన్నయట్టులె మాట లూఁదిపల్కుటనో?
తిన్నయింటనె పోరు తెచ్చిపెట్టుటనో!
కలహాభోజనుఁ డను ఖ్యాతిఁ గాంచితివి;
తల నిట్లు వ్రాసినతండ్రిని దెగడి
తనకుఁ గొల్చిచ్చిన తాతను బొగడి
జగములఁ దిరుగుట సరిపోయె నీకు
మముఁబోంట్లఁ జెనకుట మాటలపనియె?
తిన్నఁగాఁ బొమ్మిఁక దేవమునీంద్ర!"
అని పల్కుబలిదైత్యునాంతర్య మెఱిఁగి
మాఱువల్కఁగ నోడి మరలె నారదుఁడు;
సురముని వెళ్లనై సురిఁగిన వెనుక
శుచిమతులై వారు శూలినిఁగూర్చి
నిరవధికతపంబు నిష్ఠఁ గావింపఁ
బశుపతి దనుజులభక్తికి మెచ్చి

నందీశవాహనానందుఁడై వచ్చి
పార్వతీసతితోడఁ బ్రత్యక్షమయ్యె,
తెల్లనినందిపై దేవితోఁ గూడి
సాక్షాత్కరించిన స్వామిని గాంచి
పులకితగాత్రులై పూర్వదేవతలు
శ్రుతిమనోహరముగా స్తుతియించి రిట్లు.
"సోమసుందరమౌళి! చూడుము మమ్ము!
కామతమోహేళి! కావుము మమ్ము!
భద్రామనోహరా! పాలింపు మమ్ము!
అర్ధనారీశ్వరా! ఆలింపు మమ్ము!
భవబంధనము లేదు, పరుఁడవు నీవు;
గుణబంధనము లేదు, గురుఁడవు నీవు;
ప్రకృతిబంధము లేదు, ప్రభుఁడవు నీవు,
ప్రకృతితోఁ జొత్తువు, ప్రకృతి నేలింతు
సంసారి వయ్యు సుజ్ఞానుండ వీవు
అర్ధనారీశ్వరాద్యంతమూర్తులను
భవుఁడవై మమ్ముఁ బ్రోవఁ బ్రత్యక్షమైతి
పాలింపవే మమ్ముఁ బార్వతీనాథ!
సరసమోహనవిశ్వసంకీర్తనముగ
గురుతరానంద సద్గురుకీర్తనముగ
సంసారతారణస్వరకీర్తనముగ
భక్తిప్రణయరూపభవకీర్తనముగఁ

గైవల్యభాగ్యసంగతకీర్తనముగఁ
బార్వతీపరమేశపదకీర్తనంబు
వినిపింపఁ గంటిమి; విశ్వదంపతులు
కనిపింపఁ గంటిమి కైవల్యపదము."
బలి, హాలి, శ్రుతిసూక్తిఁ బ్రార్థింప నిట్లు
కరుణాంతరంగుండు గంగాధరుండు
భక్తమందారుండు ప్రహ్లాదుఁ డగుచు,
"అసురనాయకులార! అనుజన్ములార!
వీరభద్రునికంటె వేయిమడుంగు
లాదరించుచునుందు నాత్మలో మిమ్ము;
మీతపోనిష్ఠకు మెచ్చి యిచ్చుటకి,
వర మిచ్చి మెప్పింపవచ్చితి" ననినః
సర్వేశ్వరుని సుప్రసన్నవాక్యముల
గన్నులా లానందాశ్రుకణములు గురియఁ
జేతులు జోడించి శివభక్తు లనిరిః
"వరము ప్రాసాదింప వచ్చితే వరద!
తనయుల దయఁ జూడఁ దలఁచితే తండ్రి!
దానవకులవైరి దామోదరుండు
మముఁ జూచి మాతోడ మాటాడుమాత్ర
నిశ్శంకుఁ డగునట్లు నీ విమ్ము వరము."
అన విని శంకరుఁ డాత్మ శంకించి,
తెలి వేది యర్ధాంగిదిక్కుఁ గన్గొనిమై;

హిమశైలసంజాత యెలనవ్వు నవ్వి
యిగురుఁగెంగేల నందీశ్వరుఁ దట్టె;
మెడ పైఁడిగంటలు మెల్లన మ్రోయ
మోము వాలిచి నంది ముంగాలు గదపె;
దనుజు లీతడఁబాటు తముఁ దామ యెఱిఁగి
శివు తేజి కెదురుగాఁ జేరి యిట్లనిరి.
"అన్న! నందీశ్వరా! యాఁగు మొక్కింత
పరమేశుఁ డన్నింట బాధ్యుఁడై యుండ
నొఁగాము లెఱుఁగని యనుజుల మమ్ము
నూరడింపక పోవు టుచితమే నీకు?
వర మిచ్చి పుచ్చుకోవచ్చును గాని
చనవిచ్చి వెనుదీయఁజాఁగె మాతండ్రి
కన్నబిడ్డలమమకారంబుఁ దలఁచి
జగదంబ! నీ వైన సవరింపవమ్మ!
అఖిలేశ్వర! జగన్నియంతవు నీవు
నీశాసనములకు ని ల్పుండునయ్య!
జగదంబ నవ్వించుసందడి గాక
నందిని గదలించునటన మే లయ్య!
కొడుకుల యీచిన్నికోరికఁ దీర్చి
మాయమ్మనవ్వు క్రమ్మఱఁ గాంతుగాక!
తనయుల దయఁజూచు తండ్రి పీ వనుచు
విశ్వవిఖ్యాతిమై వెలయుదుగాక!

నా విని, బొమ్మచందంబున నల్లె
యున్నచోటనె నిల్చియుండె నానంది;
ఆపరమేశ్వరు నర్థాంగలక్ష్మి
చిత్రవిచిత్రంపుఁజెలువంబుఁ దాల్చె;
భక్తులకార్యతత్పరతను జూచి
ప్రకృతిస్థుఁడై యుమాపతి తలయూఁచి
యాంతర్యమున మెచ్చి యభయంబు నిచ్చు
చిఱునవ్వు మోమునఁ జేర్చి యిట్లనియెః
"దానవపతులార! తబ్బిబ్బు లేదు,
విశ్వపాలకుఁడైన విష్ణుని బిడి
శ్రీకాంత పెఱవారిచెంత నెట్లుండు?
ఎడఁబాపు టొక్కటే యీడేఱు మీకు;
హరికి భార్గవశాప మమరనాథునకు
దుర్వాసుశాపంబుఁ దోఁచిన దిపుడు,
కాలకర్మంబులు గలసినచోట
మీకామ్యసిద్ధులు మీకుఁ జేకూరు.
హితవు సెప్పెదను మీ రిట్లు పోరాదు
వేయిమాయలవాఁడు వెన్నుఁ డట్లయ్యు
హరిదాసులకు డాఁగఁ, డాంతర్య మిచ్చు
నటుగానఁ గార్యార్థులైనమీ రిపుడు
హరిభక్తవేషంబు లమరంగఁ దాల్చి
విష్ణుకీర్తనములు వెలయింతు రేని

మాయాప్రియుండను నీమాయకుఁ జిక్కి
దర్శనం బొసఁగు మీతలఁపు లీడేఱు".
భవుఁ డిట్లు పర మీయ, పక్కన నవ్వి
అగజాత భక్తుల నల్లనఁ గాంచి
"సుతులార! మీమాట సోఁకినయంత
పగతురు విభ్రాంతిపడునట్లు మీకు
శాంబరీమాయ ప్రసన్న మౌ" ననియె.
"శ్రుతిశూలము గొని యేసితి రేని
అభిమతార్థంబు మీ కందు" నటంచు
నందుఁడై దితిజుల నంది దీవించె.
అగజావిభునిచేత, నంబికచేత,
ధరవృషాధిపుచేత, వరముల నంది
బలిదానవుఁడు వారిఁ బ్రస్తుతి సేయ,
హరి దానవుఁడు వారి కంజలి సేయ,
భక్తసంస్తుతులకుఁ బ్రమదంబుఁ గనుచు
గిరివరాత్మజ తన్నుఁ గీర్తించుచుండ
నందీశవాహుండు, నాగభూషణుఁడు
వేంచేసె నంబరవీథి; నావెనుక.
పట్టెనామములతో ఫాలంబు నిండఁ
దులసిపూసలపేర్లతో మెడ నిండ
శంఖచక్రములతో భుజదండ నిండఁ
గవిక చేలములతోఁ గటితటి నిండ

నసుసలు నిశ్శంపు హరిదాసులెల్ల
హరినామసంకీర్తనాలాపములను
బంగారువీణలఁ బలికించుకొనుచు
వైకుంఠపురి చేర వచ్చి ద్వారమున.
జయవిజయులఁ గాంచి సన్నుతుల్ నించి
మరల వారలచేత మన్ననలంది
పరమేశ్వరప్రభావంబువలన
సన్నిహితంబైన సాహిత్యశక్తి
వీణాశ్రుతుల మహావిష్ణునిమహిమ
బహిరంతరంబులఁ బ్రకటించుకొనుచు
సంకీర్తనంబుల సాగించుకొనుచుఁ
బలికించి రావేళ భావగీతములు.
"నానోముఫలముగా నడయాడఁగంటి
నఖిలాండనాథుసింహద్వారమందు,
నాతపఃఫలముగా నాఁచికొఁగంటి
నాత్మేశుహృదయరాజ్యాధిపత్యంబు,
పండులు కొఱికినఫల మింక లేదు,
కన్నెఱ్ఱఁ జేసినకథ యింక లేదు,
వదరకుము శుకంబ! పాడకు పికమ!
నాథుఁడు నేను మంతన ముండువేళ.
మునుపీవు సుకృతివి మురళిఁ బల్కింప?
వెనుక ధన్యవు నీవు వీణ ప్రేమోగింప,

పాడకే కోకిలా! పలుకకే చిలుక!
నే నందుకొంటి నానీలాలమురళి;
నాచేతఁ బడినది నాప్రైఁడివీణ;
సూత్రధారిని నేనె సుకృతిని నేనె,
హరినామసంకీర్తనామృతసేవఁ
జొక్కఁడు నానాథుఁ జొక్కింతు నింక.
వైకుంఠపతి! నిన్ను వలచి వచ్చితిని
దేశదేశంబులఁ దిరిగి వచ్చితిని
వెదకుచు వెదకుచు విమలపదంబు
సేవింప వచ్చితి సెల వీయు మింక
ముద లయి మ్రొక్క నీమోముఁ జూడంగ
విశ్వేశ! నీకయి వేచి నే నుంటి
తలుపులు తెఱచి, చిత్తంబును మఱచి
హృదయేశ! నాకోస మెదురేల చూతు?
సిరు లొల్ల నీపాదసేవయె కాని,
పద మొల్ల నీమీఁదిభక్తియె కాని,
జ్ఞానంబు నొల్ల నీస్మరణయె కాని,
గౌరవం బొల్ల నీకరుణయె కాని,
అర్థినై దాస్యంబు నభిలషించితిని
వరదుండవై నాకు వైకుంఠవాస!
దర్శనంబు నొసంగి దాస్యం బొసంగి
ఆదరింపగ నేఁ డభయ మీవయ్య!"

భక్తి లీవిధముగాఁ బాడి కరాయిడఁగ,
నగరిలో లక్ష్మి కానందంబు గాఁగ
సొగటాల నాడుచు సోలి, యాలించి
'అభయమిచ్చితి' నని యబ్జాక్షుఁ డనియె,
'ఆటవోడితి రిప్పు డభయ మెవ్వరికో
సెలవీయుఁ' డని లక్ష్మి చిఱునవ్వు నవ్వ
హరి లేచి మాటాడ కాస్థానికేఁగెఁ
జేసినపని కంత సిరి చిన్నవోయె.
నాలుగుమూలల నగరిలో నంత
హరిదాసులనుగూర్చి యబ్జాక్షుఁ డిడిన
యభయవాక్యంబున కలజడి పుట్టె
తుంబురుం డిటునటుఁ దోఁపక తిరిగె,
నారదుం డున్నజ్ఞానంబు నశింప
గరుడుని చెవిలోనఁ గాబోఁలు, నేమొ
యూఁది వెల్లమొగంబు నొంది భ్రాన్పడియె;
తనతప్పె లక్ష్మికిఁ దలమీఁద నుండె.
తుది కంద తేకమై త్రొక్కుడుల్ గాంచి
దాసుల కభయంబు తగ దని కొంత
విన్నవింపగ మహావిష్ణునిచెంత
కొక రొక్కరుగఁబోయి యుగ్గడించుటకుఁ
దెగువచేసిరి కాని తేఁకువ లేక
యెవ్వరు ముందేగి యెఱిఁగింపవలెనో

మతి దప్పి శాంబరీమాయకు లోఁగి
తెలక, యిందందు తిరిగి; రాఁకిపప.
తుంబురుం డిది దుష్టదోహదం బనియె
నారదుం డిది విధానంబు గా దనియె
వైనతేయుం డిది వరుస గా దనియె
గుణునువా లిది మాయఁగూరుట యనియె
కంతుం డిది ప్రమాదకారణం బనియె
లక్ష్మి యియ్యది భయాలంబనం బనియె
ఎవ్వ రే మాడిన నేమి? యర్థులకుఁ
బలు కిచ్చి తప్పునే ప్రభుమూర్తి యతఁడు?
హరి యురంబున లక్ష్మి యలిగి కూర్చుండె,
చక్రంబు బుజమున నసి దప్పి పడియె,
గరుడుండు పాదాలకడఁ బడియుండె,
మన్మథుం డాత్మలో మత్సరపడియె,
వీణతీగలు త్రెంపి వేసెఁ దుంబురుఁడు,
మతిదప్పి యిటునటు మసలె నారదుఁడు,
సంసార మిట్లుండ సారసాక్షుండు
బెదరక దాసులఁ బిలిపించు కొనియె.
వినమితగాత్రులై వీణాస్వనములఁ
గంఠస్వరమ్ములు గలిపి శ్రీనాథు
శోభనముఖమునఁ జూపులు నిలిపి
హరినామసంకీర్తనాలాపములను

తముఁ దామె మఱచి నృత్యముఁ జేసికొనుచుఁ
బఱతెంచుచుండిన భక్తులఁ గాంచి
కుశలకటాక్షముల్ గొసరి విభుండు
తేనియపల్కులఁ దేర్చి యిట్లనియె:
"గొడవలు లేవుగా గుమ్మమునొద్ద?
తడవయ్యె నే మమ్ము దరిసింప మీకు?
దాసానుదాసునితప్పు సైరించి
చనుదెంచినారంతే చాలు భాగ్యమున!
దాసులు చుట్టాలు, దాసు లాత్మజులు,
దాసులే యునుగులు తన కెల్లయెడలఁ;
దనకు దాసులకు భేదం బెందు లేదు
దాసులఁ జూచితి ధన్యుండనైతి".
అన విని యుప్పొంగి హరిదాసు లనిరి
"దానవవైరి! మాతపములు పండెఁ;
గువలయాధీశ! మాకోర్కులు నిండె,
శ్రీనివాసునిదయఁ జేసి యీనాఁడు
దాసులజన్మముల్ ధన్యంబు లయ్యె!
కన్నులు కన్నులఁ గలిసికొన్నపుడె,
చిత్తంబుఁ జిత్తంబుఁ జేకొనయపుడె,
మావరంబులపంట మాకు లభించె."
అని వినుతించుచు నసురనాయకులు
లక్ష్మీశు పదకమలములకు మ్రొక్కి

బలి పాటఁ బాడఁగా బ్రహ్మానుభూతి
నందినట్టులు హాలి యాడఁగాఁ దొడగె;
పరభక్తి కది పారవశ్యచిహ్నముగఁ
బద్మాక్షుఁ డాత్మలో భావింపఁదొడగె;
హాలి వీణ మీటఁగా సద్భుతానంద
పరవశుండై బలి పాడంగఁ దొడఁగె.
"హృదయేశ! ప్రాణమే యిచ్చినసిన్నుఁ
గానని యొకనాఁడు కసరి తిట్టితిని,
పలుకని యొకనాఁడు ప్రాఁకులాడితిని,
నిలుచునే కోపంబు నినుఁ గన్నయంత?
న న్నాడికొను నంగనాచు లేద్వంగ
నాకంటెఁ బడతివి నా కంతె చాలు;
నను బతిమాలితి నా కంతె చాలు;
సరసఁ జేరితి హరీ! చరితార్థ నైతి.
హృదయంబుతోడనే యెగిరి రాలేక
ఆత్మేశ! నీయెడ నపచారి నయ్యు,
భావంబువెంటనే పరువెత్తలేక
అఖిలేశ! నీయెడ నపరాధినయ్యు,
మదిలోన నీదివ్యమంగళాకృతిని
సేవించుకొంటిని జేరితి నిన్ను;
తలఁపులో నీదివ్యతత్త్వరూపంబుఁ
గల్పించుకొంటిని గాంచితి నిన్ను.

పదము లొత్తఁగ నేర్తుఁ బాడంగ నేర్తు
భావ ముంపఁగ నేర్తుఁ బచరింపనేర్తుఁ
గృతులు దీర్పఁగ నేర్తుఁ గీర్తింప నేర్తుఁ
జిత్త మత్తఁగ నేర్తు సేవింప నేర్తు
భక్తిసేయఁగ నేర్తుఁ బాలింప నేర్తు
ఆలించి నాదాస్య మంగీకరించి
సెల విమ్ము నే నేమి సేయంగవలెనొ?
నాథ! నీచిత్తము, నాభాగ్య మింక.
వక్షంబు బరు వెక్కె వరద! నీ కిపుడు
శ్రీకాంత నానెత్తిఁ జేర్చికో నిమ్ము,
భుజములు నొచ్చెను భువనేశ! నీకు
భూకాంత నాభుజంబుల మోవ నిమ్ము
శంఖచక్రంబుల సకలాయుధముల
నఖిలాంగకములు కాయలు కాచిపోయె
దాస్యంబు సేయ నే దగ్గఱనుండ
ప్రభువరా! నీ కిట్టిబడలిక లేల!"
అని దానవుఁడు పాడ నబ్జనాభుండు
ఆ శాంబరీప్రభావాహతుఁ డగుచు
నది భక్తులప్రపత్తి కానవా లనియొ,
అది దానవరులభక్త్యావేశ మనియొ,
అది భావసంకీర్తనానంద మనియొ,
అది శ్రుతిసుఖముగా నాలించెఁ గాని

అది యమంగళవాక్య మనుకొనఁ డయ్యె
ఆగ్రహింపఁగనేరఁ డయ్యె నందులకు.
ఆ యమంగళవాక్య మాలింపలేక
ధృతి యేఁది శ్రీకాంత తెరలి మూర్ఛిల్లె;
తమ్ముఁ డా మెఱుఁగ తార్క్ష్యాదు లెల్లఁ
జేష్టలఁ దక్కిరి చిత్రలఁ జిక్కి;
మాయచే స్మృతి వీడె మాధవుఁ డంత;
అద నెంచి శూలాన హరి బొమ్మ నొం
కమలతో వనమాలఁ గౌస్తుభమాల
హరియించి దానవు లరిగిరి సురిఁగి.
పోయె లక్ష్మి యటంచు భూనభోంతరము
లొక్కట మార్మ్రోఁగు చున్నంతలోనె
గరుడ సుదర్శన ఘనభాగవతులు
తెలిసి యేఁగిరి వెంట దితిజుల నంట;
వారికి వీరికి వనధిపై నింట
నతిభయంకరయుద్ధ మయ్యె; శ్రీతోడ
నబ్ధిలో హరి గూలె; నాబలి పాఱె;
హరిబంట్లు వ్యర్థులై యరిగిరి పురికి.
అలోన హరి తెలి వంది డెందమునఁ
"గ్లానోఘునదె వైకుంఠపురంబు?
పోయెనే లక్ష్మి యీభువనముల్ దాఁటి?
వెట్టివాఁ డయ్యెనే విశ్వపాలకుఁడు?

కాలకర్మంబులు గలసినచోట
మునిశాప మాతఁగా మొనసినచోట
కారకు లైరి రక్కసు లిప్పు డనుచు
యోగదృష్టి సమస్త మూహించుకొనుచు!
శివుఁడు మూలము కాలచిహ్నంబు లెఱుఁగ
శివుఁడు మూలము కర్మసిద్ధిఁ జేకూర్ప
శివుఁడు మూలము లక్ష్మిఁ జేరుప నెడప
శివుఁడు మూలము తపస్సిద్ధి ఘటింప
శివుఁడు మూలము జ్ఞానసింధువుఁ దరువ
శివునాజ్ఞ లేనిదే చీమేల కుట్టు?
శివునకే విషఫలశ్రీ సమర్పింతుఁ
దా నెవ్వఁ డీమాయ తన కేమి గలదు?
శ్రీహీన మైన నాశిశిరవాసరము
ధన్యాత్మునకు వసంతంబు గాఁగలదు,
అంధకారావృతంబైన నారాత్రి
భాగ్యరాశికిఁ బట్టపగలు కాఁగలదు,
అగుగాఁక కరుణాపయస్సింధు వతఁడు
అగుఁగాక శ్రితజీవనానందుఁ డతఁడు
కాలవశంబులు కష్టసుఖములు
లడలఁ దుబ్బఁడు ప్రాజ్ఞుఁ" డని హరి తలఁచె.
తన ప్రతిజ్ఞయుఁ బోయెఁ దన్వియుఁ బోయె
వరకౌస్తుభము వోయె వనమాల వోయె

శ్రీవత్స మెంత నొచ్చెనో చిన్నవోయె
అఖిలేశుఁ డసురమాయకు వెల్లవోయె.
క్షీరాబ్ధి మథియింపజేసిన దిదియె,
జేజేల దాయాలఁ జెఱచిన దిదియె,
సితకంఠుఁ గఱకంఠుఁ జేసిన దిదియె,
శ్రీవిష్ణు విభ్రమశ్రీగాథ యిదియె.

## శ్రావణ శుక్రవారము

శ్రీలఁ జెలువొందుటకు సువాసినులొనర్చు
శ్రావణీశుక్రవారపూజలకు నలరు
నమ్మహాలక్ష్మి శుభదృష్టి నవతరించు
నమృతవీచిక లశుభంబు నార్పుఁగాత!
దేశకాలపాత్రములనుస్థితికి మనుజ
హృదయములకును సంబంధమేమిగలదో!
శ్రావణముతోడఁ దొల్లింటిచరిత మొకటి
సంస్మృతికి రాఁగ వ్రాసితిఁ జదివికొనుఁడు.
"ఏనాఁటి కానాఁడె యొగతాళిఁ గావించు
ముసలిమాదిగముండ మొగము చూచి
కడకంటిచూడ్కినే కనఁబడునాముద్దు
భామామణిమనోజ్ఞభావ మెఱిఁగి

కాలానుసారంబుగా వచ్చుపర్వంపు
దినములమాట ముందే గ్రహించి
దినవెచ్చమున కెంతధనము గావలయునో
యించుమించుగఁ జూచి యేర్పరించి
యిచ్చుచుంటి నే నడుగకే యింతదాఁక
నక్కటా! పుంసుపైఁ గారమట్లు చేసె
వచ్చినది శ్రావణీశుక్రవాసరంబు
చేతఁ గాసైనలే దేమిచేయువాఁడ.
“నీసరివారు లేరనుచు
నిన్వరియించెనె మీాలతాంగి, నీ
మీాసలలోనిన వ్యామృత
మే? సరి! శ్రావణశుక్రవారపుం
గాసు నొసంగనైనఁ గొఱ
గానియనాథవు నీకు సానిసా
వాసము లేలరోరి! తుటు
వా! సరిద్వారలఁ జూడలేదురా?
లేరబోజుంగ నీమనసు
దీరఁ జరింపఁగ నెల్లకాలమున్
దారము గట్టినావె వెల
దారకు? నీమొగమిచ్చుమాట బం
గారపుమాట గాదు వెడఁ
గా! పదరా! యని పెద్దలంటె న

న్నా ఆడిచేసి త్రోసినది
హా! యింక నూరక యెట్లు పోవుదురా?
సంచులు విప్పి రూప్యము ల
సంఖ్యము దాని మొగానఁ బారఁబో
యించిననాఁటిమాట యెట
యేఁగెనో? బూతులనాటకంబుఁ దీ
యించి క్రమంబుగా నభిన
యించుచు నున్నది యిప్పు డక్కటా!
మంచియుఁ జెడ్డయుఁగా దెలివి
మాలినతొ త్తెయుఁగంగఁజాలునే?
మూఁడంతరువులతో మేడఁ గట్టింపఁగా
నవిడిమాన్యము తెగనమ్మినాఁడ
వరుసదప్పని యేడువారాలనగలకై
మడిపల్లెపొలము చేవిడిచినాఁడ
నాకులుఁ బోకలు నత్తరువులకునై
చెల్లూరిపంపుగాఁ జేసినాఁడ
నప్పటప్పటికినై యమలాపురంబులోఁ
గొబ్బరతోఁటఁ బోద్రొబ్బినాఁడఁ
దకు౯ సర్వస్వముంగూడ దానిపేర
వ్రాసి యిచ్చితిఁ గాసైన వదలకుండ
నింక నేదాఁచికొనియున్న దేమి గలదు?
తెమ్ము తెమ్మన్న నేరీతిఁ దెచ్చువాఁడ?

పూఁటపూఁటకు నాపెద్దబూచి కొసరి
కొసరి పంపెడు బత్తెంపుఁగూటితోడ
నేను నాభార్యయును బొట్ట నింపికొనుచు
బ్రదుకుచుంటిమి చావక బ్రదుకకుండ.
"నావరాలమూట నాకొంగుబంగారు"
మన్ననోటితోనె యాఁకుసలిది
"యినుపగజ్జెలయ్య యీడుపుఁగాళ్ళయ్య"
యనఁగఁజాగె నేమి యనఁగఁగలదు!
తామన మొప్ప నన్నటు ల
దల్చుచు నుండినతల్లిఁ గాంచి భా
మామణి యైన నీకు నిది
మంచిది గా దని చెప్పకుండ నె
మ్మోమును మలంచి చిత్తరువు
బొమ్మవలె న్నిలుచుండెనౌర! నే
నే మని యెంచుకొందు; మఱి
యేగతి దానిమొగంబుఁ జూచెదన్.
భామ నామీఁదఁ గలయట్టి ప్రేమచేత
నిమిషమున కొక్కయందంబు నెఱపుకొఱకుఁ
గోకలును సొమ్ములును గోరికొనుచెకాని
యాలతాంగికిఁ దుచ్ఛధనాశ లేదు.
భామామణి నాసంగతి
నామూలాగ్రం బెఱుంగు నైనను దనకీ

నోమునకుఁ గాను నేనే
ప్రేమ నొసఁగవలయు ననుచు వేఁడుకపడెదుగా.
వలసినయపు డొక్కటిగా
నొలిచికొనుచుఁ దెచ్చి దాని కొసఁగితి మఱినా
కులకాంతయొద్ద నొకమం
గళసూత్రముకంటె వేఱుగలి లేదకటా!
పెడమొగము గాక నేనే
మడిగిన నానందసూచకాననమున ని
చ్చెదు నాసతి నీక నే మని
యనఁగ, నడుగరానిప్రియపదార్థము నకటా!
మాపరస్పరనిత్యసంబంధమునకు
మంత్రపరిపూతచిహ్నమై మంతు కెక్కి
నేనె నాచేతఁ గట్టినదాని నకట!
త్రెంచి నా కిమ్మనుచు నెట్లు దేవురింతు.
కాసు నీయకున్న గడుసరిముదిలంజె
యేపికుక్కవోలె నెగసిపడును;
భామ తోఁపకుండఁ బడియుండు నాకయి;
పోవు టెట్లు? పోకపోవు టెట్లు."
అనుచు నిట్లు కోటలమ్మ చెఱువుగట్టు
చెంత నున్న జువ్విచెట్టుక్రిందఁ
గూరుచుండి ర్యాలి గోవిందరా వుస్సు
రుస్సు రనుచు వెచ్చ నూర్పుచుండె.

అతఁడు చూచుచున్న నటు చూడకుండిన
నెవరిజోలి లేక యేఁగుకాళ్ళ
మట్టి తిరిగిపోవ నర్కుఁ డంబుధిలోన
మునిఁగెఁ; దమము దెసల ముంచికొనియె.

దద్దితలుపుమూల దివ్వె ముట్టించిన
సమయ మాదిగాఁగ జానకమ్మ
విభునిరాకకొఱకు వేచి తాఁ గూర్చుండెఁ
గడకు వంటయింటిగడపచెంత.

పడఁతి యటు చూచుచుండఁగ
గడియలు జాములుగ మాఱి కన్నులలోనే
కడచుటయె కాని ప్రియనా
థుఁడు వచ్చెడు జాడయైనఁ దోఁపకయుండెన్.

అపు డయ్యంగన యంతరంగమునఁ "గ
ట్టా! యింత సేయంగఁ బా
పపుదైవంబునకున్ వినోద మొకో? మా
పైఁ గోపమో? కాని చో
విపరీతస్థితిఁ గూర్చి యీవిధమునన్
వేధింపఁగా సర్వభూ
తపరీపాలకుఁ డైన దేవుఁ డిటు ని
ర్దాక్షిణ్యుఁ డై యుండునే?

చేతఁ గాసు లేక చింతాకులాత్ముఁడై
నొగులుచున్న నామనోహరునకు

సరిగఁ జేయఁదగిన పరిచర్యలందు నా
దోష మేదియైనఁ దోఁచె నేమొ?
ఇల్లెరవుగ వారాంగన
యిల్లె నతముగాఁ దలంచి యెల్లప్పుడు నా
వల్లభుఁడు చరించుట కే
నొల్లమి వాటించి యుంటినో యెప్పుడైన సకా?
పడవుఁబడఁతివలలఁ బడిననాథునకు నా
మోముఁ గన నసహ్యమే మొ యనుచు
శిరము వంచి సేవ చేయుచుంటిని గాని
కన్ను లెత్తి చూడఁ గలిగినానె?
ధనమునకు వలచు వారాం
గన యొల్లమిఁ జూపి మనసుఁ గందించునో నా
ఘన కని నగలను నాయం
తనె యొసఁగితిఁ గాని యురక తగవాడితినే?
సానియింట నైనఁ జల్లనిమనసుతోఁ
బ్రాణనాథుఁ డుండవలయు ననుచు
వచ్చునంతలోనె వడ్డించుచే కాని
నిమిషమైన నింట నిలిపి యెఱుఁగ.
ఆదరించి మాటలాడక యుండిన
నారగింపవచ్చు నప్పుడైన
నాత్మభర్త కంటికగపడు చుండె నా
కంతె చాలు ననుచు నాసపడితి.

వెలవెలఁది ధనము జెన్నని
యలిగి మనోనాథు నొప్పనాఁడుటపలనన్
గలఁగినమదితోఁ దోఁపక
యలమరుచున్నాఁడొ? యేమొ? యారాటమునన్
కరముల దాఁటిపోయె సిరి;
కట్టఁగగుడ్డ, తినంగఁ గూడునున్
గఱవయిపోయె; నాపడపుఁ
గత్తియకోరికలెల్లఁ దీర్పదు
స్తరమయిపోయె; నిట్లయిన
దానిపయిం దగులంబు వీడదు
ర్భర మయిపోవుచున్న యది
భర్తకు; నేనిఁక నేమిచేయుదున్.
ఎత్తఁటి నీకు నెట్లు సహి
యింపఁగ రానిదొసంగు గల్గునో
యత్తఱి దీని నీమగని
కందఁగఁజేయు మటంచుఁ జెప్పి మా
యత్త యొసంగె నొక్క పర
మాద్భుతవస్తు వొకండు; దానిఁ దా
యెత్తున నుంచి నేను నపు
డే గళసూత్రమునందుఁ గూర్చితిన్.
ఆమె చెప్పినట్టు లది యిప్పు డెట్టులైనఁ
బ్రియుని కిఁక యుపకరించు ననుచుఁ

బోవ మిగిలి యున్న భూషణం బిదె యని
యీయఁ దలఁచి యుంటి నీదినమున.
అకటా! యతఁడు దురాశా
వికలహృదయుఁడగుచుఁ బాపి విధిదూఱుచుఁ దా
నొక చిల్లిగవ్వఁ దేనో
పక యుండుట కెంతచింతపడుచుండెనొకో.
అర్ధరాత్రివేళ నంధకారంబున
నాఁడుదాన నొంటిదైనదాన
నిల్లు వెడలి చెప్ప డెఱుఁగనిదాన నే
నెట్లు విభుని వెదక నేఁగుదాన?
ఏమి సేయుదాన నెటు ప్రొద్దుదాన నీ
కాళరాత్రి నెట్లు గడపుదాన"
ననుచు జానకమ్మ యతివిషాదంబునఁ
బ్రియునికొఱకుఁ బరితపించుచుండె.
తలవాకిటను దల్పు తట్టినయట్లైన
లేచి యవ్వలి కేఁగి చూచి వచ్చుఁ;
బెరటిగుమ్మమునొద్దఁ బిలిచినయట్లైన
నల్లన చెవి యొగ్గి యాలకించుఁ;
జేరువ నట చీమ చిటుకుమన్నట్లైన
నదరిపాటున లేచి యవులఁ జూచుఁ;
బ్రియుఁ డెట్టయెదుటఁ గాన్పించినయట్లైనఁ
దత్తరంబున లేచి రొం త్తగిల్లు

నెపుడు వచ్చునో నానాథుఁ డింటి కనుచు
సంభ్రమించుచు నున్న యాజానకమ్మ
కపుడు పరిసరముల నెట్టి యలుకుడైన
భర్త జాడలె కాఁ గానఁబడుచునుండె.
అట్టులుండ రాత్రి యామద్వయం బయ్యెఁ
గూరుచున్న సతికిఁ గునుకు వచ్చె
నంతలో నదేమొ యాకస్మికంబుగా
నట్టె యింటిదీప మాఱిపోయె.
ఒక్కయింతలోనె యువిద తా గొంతెత్తి
"వదలు మయ్య! చేయి వదలుమయ్య!
మగఁడు ముట్టఁదగిన మంగళసూత్రంబు
ముట్టఁబోకు మయ్య మ్రొక్కెదాన.
వనిత పతికొఱకునై నన్
వనితకొఱకు నాథుఁడైనఁ బ్రాణంబులు పో
యినదాఁక విడువనొల్లని
ఘనవస్తువు నంట నీకుఁ గలుషము గాదే!
ఐదువతనమునకుఁ గుఱి
గాదిలిమగనియెడ నిరతగాఢప్రేమా
పాదనమున కుపకరణము
గాదే దీని నొరుఁ డంటగాఁ దగ వగునే?
కడుపు మండుచున్నఁ గలవారిభవనంబు
లకట! యీపురంబునందు లేవె?

యిప్పు! యిట్టిపేదయిల్లాలి తాళిత్రో
నీదరిద్రజలధి నీఁదఁగలవె!''
అని యీగతి వాపోయెడు
వనితపయిం గరుణలేక వాఁడట్టె పుటు
క్కునఁ దాళిఁ ద్రెంచికొని వ
చ్చినదారిం బాఱిపోయెఁ జిడిముడిపడుచున్.
ఇరుగుపొరుగువార లెల్లరు నాజాన
కమ్మ యార్తనాద మాలకించి
త్వరగ నేఁగుదెంచి పరికించిరే కాని
దొంగజాడ నంత దొరక దయ్యెం.
జానకమ్మ, పూతచరిత, ప్రాణముకంటె
ఘనము గాఁగఁ జూచుకొనెడు తాళి
చోరుచేతఁ బడియు సుదతియొడిం జేరెఁ
దల్లిఁ బాయనట్టి పిల్లవోలె.

* *

కంట నిదుర లేక కాలుగాలినపిల్లి
కరణి వీథులెల్లఁ దిరిగి తిరిగి
కుటిలచిత్తుఁ డైన గోవిందరావు వస్తు
భామమందిరంబు పజ్జకరిగి.
కాచదీప మున్న కంబముకడ కేఁగి
చిన్నజేబులోనఁ జేయి వెట్టి

పసుపుదార మొకటి పైకెత్తి కనుఁగొని
తెల్లబోయి కన్నుఁ దేలవైచి.
కటకటపడుచుండఁగ న
చ్చటి కొకగుఱ్ఱంపుబండి చనుదెంచిన నే
మిటి కిది యని నెమ్మదిఁ ద్రొ
క్కట మినుమడియైనఁ దెలియఁగాఁదగుననుచున్.
అశ్వాచోదకు చెంగటి కరిగి మిగుల
మెలపుతోడుత నాతనిఁ బలుకరించి
యాగమనకారణంబేమి యనుచు నడుగ
నతఁడు నిట్టూర్పు విడిచి యిట్లనుచుఁ జెప్పె.
"పాములకోటజమీదా
రీమెకు నెల కైదునూఱులిచ్చి నిలుపఁగా
సామోదించెను దుర్భర
కామవికారంబు గన్నుఁగవ మూయింపన్.
తంటాలమారి వెలవా
ల్గంటులవిషదృక్ప్రసారకలనంబునఁ బె
న్మంటల మిడుతలవలె నిటు
వంటిధనికు లెందఱైరో పరికింప మొకో!
తన కొంతజమీ నున్నన్
గనుఁగొన గోవిందరావుకంటె ధనికుఁడే
తినుటకు లేకుండఁగ నా
తని జేసినభామ యితనిదయఁ జూచునొకో!

తనకుఁ బ్రాణమానధనముల నర్పించి
కులవధూమతల్లి గొలుచుచుండఁ
దనదుప్రాణమానధనముల హరియించు
వెలవెలందిఁ గోర వెఱ్ఱిగాదె."
అనుచు నీరీతి నతఁడు దన్నాదరించు
ప్రభునియవివేకమునకునై పరితపింప
నదియె గోవిందరావున కాత్మమూఢ
బుద్ధి మాయించుదివ్యప్రబోధ మయ్యె.
అంతరంగంబునందుఁ దాపానలంబు
నిండి యాకస్మికంబుగా మండసాగె
భావవీథిని శతకోటిభానుకిరణ
జాలములు దుస్సహంబులై జాలుకొనియె.
కన్ను లెఱ్ఱనయ్యెఁ గనుబొమ లుబ్బెఁడివడెఁ
బెదవు లదరె నాల్క పిడుచవాఱె
మొగము జేవురించె ముకుపుటంబులు విచ్చె
నిడుదయూర్పు లెగసె నొడలు వడఁకె.
ప్రబలమారుతమున నుడివడినజలధి
పెడలెడుతరంగములువోలె విపులతాప
వహ్నిఁ గ్రాఁగెడునాతనిస్వాంతమందు
నెగసె భావస్ఫులింగంబు లగణితముగ.
తడఁబాటు గదుర ముందడుగు వేయఁగఁజూచు
నాఁ డొందుల కటంచు నట్టె నిలుచు

దర్పమేర్పడఁ బోయి తలుపుఁ గొట్టఁ దలంచు
నిది యేమిపని యంచు మది మరల్చుఁ
బిలిచినఁ బలుకునో పలుకదో యని యెంచు
నేమైన నేమని యూసడించు
మొగముఁ జూపించి నాలుగుమాట లన నెంచు
సిగ్గుండునా యని చీదరించుఁ
గాలకారణవశత నాకస్మికముగ
స్వాంతమునఁ దోఁచునట్టిభావాంతరంబు
ప్రకృతినే మార్చివైవ నప్రాజ్ఞుఁ డొకని
ప్రాజ్ఞుఁగాఁ జేసె ననుట యేపాటిమాట.

ఇంతలో భామ ముద్దుల నిచ్చి పంప
నాజమీందారుఁ డేతెంచి యచట నున్న
ర్యాలిగోవింద రావుపార్శ్వముననుండి
యశ్వశకటంబుపై నెక్కి యవులఁ జనియె-
కోపమొ నిరాశయో యనుతాపమో య
సూయయో దుఃఖమో మదిఁ జొచ్చి కలఁపఁ
దెలుపఁగా రాని వేదన యలమికొనఁగఁ
గొయ్యవడిపోయె నతఁ డొక్క కొంతసేపు.

ఇట్టు లుండి యుండి యేమి భావించెనో
గాని యతఁడు సానిదానియింటి
వంకనైనఁ గనక వడివడినడలతో
నాత్మగృహముచెంత కరుగుదెంచి.

గుండె లతివేగమునఁ గొట్టుకొనుచునుండ
దీవ్రనిశ్శ్వాసముల మాట దేలిపోవఁ
దనసతీమణిఁ బిలుచుచుఁ దలుపుఁ గొట్టఁ
దత్క్షణమ వచ్చి యాతన్వి తలుపుఁ దీసె.
భయము విస్మయంబుఁ జిత్తసంభ్రమముఁ దోఁప
దిగులుపడుచున్న యట్లున్న మగువఁ గాంచి
సంశయము, సిగ్గు దుఃఖంబు నందడింప
నతఁడు గొబ్బునఁ గౌఁగింట నదిమికొనియె.
ఆకులు రాల మోడైన నట్టిసుమశాఖఁ
దుదిదాఁకఁ జిగురాకు దొడిగినట్లు
గ్రీష్మతాపమునఁ గ్రాఁగెడుసరోవరమున
మలయానిలము స్వారి సలిపినట్లు
అడుసుముట్టఁగ నింకి యడుగువట్టినయేట
నమృతవాహిని దొలఁకాడినట్లు
కాలమేఘమునఁ జీకటులుగ్రమ్మినమింటఁ
బండువెన్నెలవెల్లు నిండినట్లు
సతతపరితాపపరిఖిన్న జానకీహృ
దంతరంబున నానంద మంకురించి
యంత కంతకు వర్ధిల్ల నానెలంత
ప్రాణనాయకుకౌఁగింట మేను మఱచె.
అద్దమగుమాయ మాయించి యాత్మ దివ్య
మోక్షలక్ష్మీసమాసక్తి ముదిసినట్లు

రోవెలఁది రోసి గోవిందరావు నాత్మ
దారతోఁ గూడి తన్మయత్వంబుఁ గాంచె.
ఆమహానంద మవ్యక్త మైనదగుట
నప్పు డాదంపతులహృదయాంబుజంబు
లెట్లలరి భావగంధంబు లెట్లు లెగసి
పరిమళించెనో తెలియంగఁ బడకయుండె.
జానకమ్మ యెంత చక్కని చెలువయో
యిన్నినాళ్ళదాఁక నెవరి కెఱుక
ప్రియునిప్రేమతోడి బిగికౌఁగిటను గూర్పఁ
బడినయప్పు డెఱుక పడియెఁగాక.
తనసహస్రాపరాధముల మన్నింపు మం
చును భర్త సతి వేఁడుకొనకయుండ
నన్నింటికిఁ గాలాన కారోపణముఁజేసి
సతి పతికిఁ బ్రియంబు నలుపకుండఁ
దనపూర్వవృత్తంబుఁ దలఁచి నాథుఁడు దిట్టు
కొనుచు నాఁదల వంచికొనక యుండ
నైనదేమో యయ్యో నామాట లేక నేఁటి
కని ప్రాణకాంత యూరార్చకుండ
నొండొరుల దర్శనములనే యొల్లఁబోయి
స్పర్శనంబులఁ దన్మయత్వంబుఁ గాంచి
యలరు నాదంపతుల కష్టములును నిష్టె
ల్లవా తెడు నన్నట్లు తెల్లవాఱె.

భావశాంతిని సూర్యప్రభాతమందుఁ
గర్మసాక్షి కరంబులఁ గనులు విప్ప
వికసనము గాంచు కమలకోరకములట్టు
లలరు నాదంపతులకును దెలివి వచ్చె.
ప్రాణనాథుపాదపంకజంబుల చెంతఁ
బసుపుఁ ద్రాటఁ గూర్చఁబడినయట్టి
పసిఁడితాయెతొకటి పడియుండుటను గాంచి
జానకమ్మ సంతసమునఁ బొంగె.
"కష్టవేళ నీమగనిచేతి కిమ్మని
యత్త నా కొసంగినట్టిదిని
నర్ధరాత్రి చోరుఁ డపహరించినదీని
బ్రాణనాథ! యెట్లు పడసితయ్య?"
అనిన గోవిందరావు దీనాననంబు
వెల్లఁబాఱంగ స్వరము కంపించిపోవఁ
"ప్రాణనాయిక! యంతటిపాపి కుటిల
చిత్తుఁ డీతఁడెను" యన్ని శిరము వంచె.
జానకమ్మ యతనిఁ జల్లనిమాటల
మనసులోనినెగులు మాయఁజేసి
"యత్త కష్టవేళకని యిచ్చెఁ గావున
దీన నేదొ యుండి తీఱవలయు."
అని వచింప నాతఁ డద్దానిఁ గైకొని
విచ్చి లోన నున్న వెండిరేకుఁ

బై కిఁ దీసి చూడఁ బరమాద్భుతము దాని
పైని నరిగ వ్రాయఁబడియె నిట్లుఁ
"నాయనా! ధర్మకామని(శ్రేయసములఁ
జేర్చెడిధనంబు రిత్త చేసితివి నీవు
గతము గతమయ్యె నీక బుద్ధి గలిగెనేని
వేగ నాతల(క్రిందఁ ద్రవ్వికొనుమయ్య!"
అనెడు శ్రీదేవతాప్రసాదామృతాక్ష
రములఁ బురుడించు నయ్యక్షరములఁ గాంచి
యాసతీపతు లానంద మతిశయింప
మెఱసి రామని సుమలతాతరులఁబోలి.

దుర్గంధపూరితాంధువున మునకలు వెట్టి
దివ్యపుష్కరిణిలోఁ దేలినట్లు
అతిఘోరదుస్స్వప్నమందుఁ గన్నులు మూసి
దివ్యబోధమునఁ గన్దెఱచినట్లు
భయదోగ్రమృత్యుగహ్వరమునఁ జొరఁబాఱి
దివ్యలోకమువంకఁ దిరిగినట్లు
దుష్పథంబునఁ గాలు దూలిపోవఁగఁబోయి
దివ్యపథంబునందికొనినట్లు
అపుడు గోవిందరావు భాగ్యంబుకలిమి
నీశ్వరానుగ్రహంబున నింతలోన
దుస్సహావస్థలోనుండి తూలితూలి
తుదకు నపరిమితానంద పదవిఁ గాంచె.

కోరి తెచ్చికొన్న దారిద్ర్యము నశించి
తఱుగు లేనిధననిధాన మబ్బె
వల పొకింత లేని వెలవెలందుక రోసి
యనుఁగుటింటిమీఁద మనసు నిలిచె.
స్వాంతమలరంగ నాఁడె యాసతియుఁ బతియు
శ్రావణీశుక్రవాసర సద్వ్రతంబు
నాగమోక్తంబుగా భక్తి నాచరించి
యిందిరాదేవిఁ గొలిచి రానందలీల.
శుక్రవారవ్రతసుప్రసన్నాత్మయగా
నమ్మహాలక్ష్మిమాహాత్మ్యముననొ
సురుచిరశుభగుణాకరమణిఖనియైన
సతిజానకీసాహచర్యముననొ
బహువిధసుఖదుఃఖ భావావళులమైన
లోకానుభవ పరిపాకముననొ
అఘటనఘటనాసమర్థ తేజంబైన
పరభాగధేయ ప్రభావముననొ
విమలమతియైన యట్టిగోవిందరావు
నాఁటనుండియు వెలయాలి మాటమఱచి
కులవధూమణితోఁగూడి కలసిమెలసి
యవనిపై స్వర్గసౌఖ్యంబు ననుభవించె.

అనురూప:

శ్రీరమణీవిలాసమునఁ
జేసి జనించి, సుబుద్ధి నొంది, శో
భారతిఁ జెట్టఁబట్టి బహు
భంగులఁ దానసురూపయావిద
ర్భరమణాత్మజాతపయి
రాగరసంబును వెల్లిఁగొల్పినా
శౌరికృపాకటాక్షములు
సారెకు మమ్ములఁ బ్రోచుఁగావుత౯.
శ్రీమీఱం దమపెండ్లివేళ దరహా
సీభూతవక్త్రాబ్జులై
తా మొండొర్వులపై శిరంబులను సీ
తారాఘువుల్ శుభ్రము
క్తామాణిక్యముల న్వాలార్చుటకుఁ బా
త్రంబుల్ మిథస్సంతత
ప్రేమాధారము లైన దోయిళులు పే
ర్మిన్ మమ్ముఁ గాపాడుత౯.
అంకముఁ జేరి పల్కుజవ
రాలి మృదూక్తులరీతి, శారదా

కంకణకింకిణీరవము
లై పడిఁ, గోకిలకీరశారికా
సంకలితానులాపములఁ
జాడ్పున, మాలవితానతాంగి ని
శ్శంక రసజ్ఞచిత్తములు
సంతసమందఁ జెలంగుఁగావుతన్!
పలుకులతోడ లోకజన
పద్ధతి, తత్త్వవివేచనంబు, ని
ర్మలగుణభావమున్, నడల
మంచియు, నొప్పుగ నొక్కటొక్కటే
తెలిపి విమోహభావముఁ
దేలిచి యందలికష్టనిష్ఠురో
క్తుల వివరింపఁగా ప్రకృతి
కో? కవికో? తగు నన్యసాధ్యమే?
ఒకపరి వేడ్కతోఁ జదువ
నోపినపాఠకునిన్ క్షణక్షణం
బ్లోకగతి మార్చుజాలిన ర
సోచితబంధురచిత్రకల్పనా
ప్రకరముతోడ నొప్పెడు ప్ర
బంధమొ? లేక మఱేదొ? కూర్చువా
నికి నెలవైన యట్టికవి
నే కనియెంచు నుతింపఁగా దగున్

పలుకులఁ దేనెలుట్టిపడ
భవ్యకథాకథనంబునందుఁ గ
న్నులఁ గగపాటుఁ గూర్చి, మది
నూల్కొనునానుడులన్ గవిత్వరీ
తులు మెఱయించి, యాతనికిఁ
దుల్యుఁడు లేఁడనఁగాఁ బ్రబంధముల్
తెలియఁగఁ జెప్పశక్తి యల
తిక్కనికొక్కనికే తగుంగదా!
అనుపమవాక్చమత్కృతుల
కర్థములన్ ఘటియించి మంజుక
ల్పనములతోఁ బ్రబంధములు
భావముఁ దన్ప రచించు వేళఁ ది
క్కనయగు మూఁడు మూర్తుల స
హా! యితఁడంచుఁ బొగడ్తఁగన్న ధీ
ధనుఁడగు సూరనార్యుని ప
థంబునఁ బోవఁదరంబె యేరికిన్?
కరము లరుగునంత వరణి రవి వెలుంగు
మెరయు నెల్లకడల కరిగి బుద్ధి
కాన బుద్ధిమంతుఁ డైనచో నెల్లెడ
వెలయఁగలుగువాఁడు వెలయువాఁడు
అనుపమధీవిశారదుల
కైనను నూహాము లెల్లయప్పుడున్

మనమునఁ దోఁచుచుండవు; మ
నమ్మునఁ దోఁచిన వెల్లఁ జెప్పవ
చ్చినపుడు కొన్ని యేగును; వ
చించిన వన్నియు నర్హ రీతి వ్రా
సిన యవియే కృతుల్ గద! ప్ర
సిద్ధకృతుల్ చిరజీవనుల్ గదా!
చిత్రాకృతులం గైకొని
పత్రంబులపై నటించి భాసురగతి వై
చిత్రిక్ మాలేఖిని యీ
ధాత్రిం బ్రేక్షకులకుక్ ముదం బిడుఁగాతక్!

---

## కథా ప్రారంభము:

అగ్రభాగము:

మలయవాయువులఁ గంపిలు తీవలకుఁ దరుక్
కరశాఖలను నూఁతగా నొసంగె
కలగీతములఁ బాడి యలయుపికాంగన
కును జిగురులు వెట్టెఁ గోకిలంబు
విరహులపై దాడి వెడలంగ మదునకు
దళములఁ గూర్చె మాధవసఖుండు
ఝంఝమ్మనుచుఁ దమ్మి జోఁపుచుఁడిన సైచి
తేంట్లకు విరివిరుల్ తేనె లిచ్చె

చలువగాలి, వెన్నెలరేలు జలవిహార
ములకుఁగా ధన్యసంపతుల్ చెలఁగుచుండ
వనము లుపవనములుగాఁగ వరలుచుండె
సౌమనస్యం బొసంగు వసంతమందు!
సకలజనంబుకన్నులకుఁ
జల్లగ నమ్మధుమాస వేళయం
దొకతఱి రేవెలుంగుగని
యుర్విపయిం దనయుల్లఁడైన ద
ర్పకుఁడు చరింపఁ జల్వవలు
వల్పఱుపించెనో నాఁగ లోకమం
తకు నొకవింతయౌ సొబగుఁ
దారిచి వెన్నెలఁ గాయుచుండఁగన్.
జగతి నిశ్శబ్దముగ నుండె సరసమృదుల
మారుతము చెంగలువపూల యోరనుండి
సౌరభముఁ గొని యల్లన జరుగుచుండె
పూవుఁగుత్తులతావి గొంపోవనేమొ!
చల్లనిపండువెన్నెలలు
చల్లనిమారుతముల్ సమేళమై
యల్లనఁ బాంథకోటిహృద
యంబులు చల్లనఁజేసి యంతనే
ఝల్లనఁ జేయుచుండె సుమ
సాయకుఁడుగ్ర దయమాలి వారిజ

త్ఫుల్లసరోజబాణము ల
తో జళిపించుచు నుండె నత్తఱిన్.
శ్రీకరమై ధరిత్రికి వి
శేషవిభూషణమై తనర్చు శ్రీ
కాకుళపట్టణంబున నొ
కానొక సౌధమునందు యౌవ
శ్రీకుఁ డొకండు నిద్దురను
జెందక కుందుచు నొంటిఁ బాన్పునన్
వ్యాకులభావ మాననము
నందుఁ గనంబడుచుండ దీనుఁడై.
తల యూఁచు నెచ్చనూర్చును
నలువయె యిటు సేయు నేమి నాగతి ౧౮౮
బలవింతు నంచు నెంచును
కలిగిన యిక్కట్టదేమొ కానితలంపన్.
కలిగియు లేకపోయెఁ జిర
కాలమునుండి కృశించు నాకు నె
వ్వాలన మనోరథంబు నిర
పాయముగా సఫలంబు నొందుఁ! నీ
యిలగలయున్నినాళు లిటు
లే యసహాయత సంచరింపఁగా
వలయునె! నాదుజన్మమును
వాయునె! ధరాయమతోడ సక్రమా!

ఇది యిటువంటి దంచు మన
కిప్పుడు కన్పడు నంచు, నేరు నే
ర్పొదవఁగ బల్కరానిదియు,
నున్నది లేనిది, లేని దున్నదం
చెద నెఱుఁగంగరానిదియు,
నెల్లెడఁ జిత్రగతిం జరించున
ట్టిది యగునాఁ యదృష్టము ఘ
టించుత మామకకార్యసిద్ధులన్.
అని తలపోయుచు నుండఁగఁ
దనయంతికమునకు ఘ్రాణతర్పణమగు ఘు
మ్మను తమ్ములపుంబరిమళ
మనిలునితో వచ్చె జాలకాంతర సరణిన్.
అది యొకవింత నేయఁగ న
యారె! విచిత్రముగాఁగఁ దోఁచె నా
మది కిపు డర్ధరాత్రిని సు
మాళమునం జనుదెంచు సౌరభా
స్పదపవనంబుఁ గాంచ సుమ
సాయకుఁ డెవ్వనియొద్ద కెవ్వతెం
బదిలముతోడఁ బంపుటకుఁ
బంతమువట్టెనో? యంచు నెంచుచున్.
నభు దేనలం గనుచుండఁగ
గలగలనందియలుగదలఁగాఁ దన తలవాఁ

కిలితలుపు కడను నిలిచిన
నెలఁతుకరూపంబు వెఱఁగు నించె నతనికిన్.
మేనుమెఱుంగుదీవ మిఱు
మిట్లను గొల్పెనొ కన్నుదోయికిం?
జానవిలాసవైఖరికి
స్వాంతము లోఁబడి యేమియయ్యెనో?
కాని, యపూర్వమైన యొక
కౌతుక మాత్మ జనించినంతనే
మేనెఱుఁగం డొకింతయును
మేర యెఱుంగఁడు విస్మయంబునన్.
అతఁడు వెఱఁగంది నిశ్చే
ష్టితుఁడై యుండంగఁ దలుపుఁ జేఁదట్టుచు నా
సతియుం బెద్దయెలుంగున
నతిదీనత తోఁప "నో మహాత్మ!" యటంచున్.
రక్షింపుము రక్షింపు! ని
రీక్షింపుము! పత్యపార్థదృష్టి నహో! ఘో
రత్నక్షోభం బెడలింపుము
పేక్షింపకు మబలఁ గావవే!" యని వేఁడన్.
వడివడిఁ జని ద్వారంబున
గడియ న్వొడలించి సతియఁ గాంచి "యి దేమీ!
పడఁతీ! యడలెద విప్పు డి
య్యెడ నెవ్వరివలన నెట్టి యిడుమలు వొడమెన్?"

అనుచుఁ బ్రశ్న సేయ నావఘామణియును
వెఱపుతోడ లోని కరుగుదెంచి
మొగము వాంచి పలికె దిగులెల్ల విడనాడి
యిపుడుగాదె. భయము నీగఁగంటి!
శరణంటి న్ననుఁ గావుమీ యభయహ
స్తం బిచ్చి లేకున్న ని
ష్కరుణాచిత్తుఁడు ధూర్తవర్తనుఁడు నన్
గారింపఁగాఁజొచ్చె నెం
దరుగం జూచిన బోవనీయఁ డతఁ డా
హా! యేమి గానుంటినో
చిరదుఃఖం బిది దీని సైప నిఁక నీ
చిత్తంబు నాభాగ్యముల్.
అనుచవ్వారిజనేత్రదీనవచనం
బాలించి యోలేమ! యి
ట్లనుసంతాపము నొందనేల? యెవఁడా
హాంతవ్యుఁ? డేలీల ని
న్వనటంబొందగఁ జేయుఁ? దెల్పు మిపుడే
వారింతు నాధూర్తు నె
మ్మనమం దూఱడు మంచు సాంత్వనవచో
మాధుర్యముం జూపినన్.
కోమ్మయు నెమ్మదిఁ గైకొని
క్రమ్మినపరితాప మింత కడ కొత్తుచు దై

ర్యమ్మున నాతని కనియెన్
దమ్ముల నిరసించు నాననమ్ము చెలంగన్.
ఓయసమానరూపవిభ
వోజ్జ్వల! యేమని చెప్పికొందు నన్
బ్రాయపువాఁ డొకండు బల
వంతముగా వెనువెంట నంటె నే
నేయెడఁ జొచ్చిన న్విడువఁ
డీయెడ లేఁడనరాదు సర్వథా
మాయికుఁడై చరించు నిది
మామకవృత్త మెఱుంగఁ జెప్పితిన్.
అనవుడుఁ బూరుషుండు విక
చాంబురుహాయతచారునేత్ర! నీ
మనమున వానికై వగపు
మానుము; నన్ శరణంబునొందియుం
డిన నిను నెవ్వరైనఁ గన
నేర్తురె? కాంచిన నోర్తు రెట్టులం
చనునయవృత్తిఁ బల్కె విన
యానతయై వనజాస్య యిట్లనుః
మాటలఁ బోవువాఁడె మరు
మాట వచింతునటంచు నెంచ కా
రాటమునొంది నెమ్మది క
రమ్ముఁ జలించుచునుండెఁ జూడు మి

ప్పాటున నంచుఁ డానతని
పాణి నరమ్మునఁ జేర్పఁబోవ న
ప్పాటలగంధి చేత కల
ప్రాయపువాఁడు తలంకి యిట్లనున్.
వెఱ విడిచి మాట లాడుము
పరసతి విశ్లేల నాదు పాణిగ్రహింపన్
మరియాదగాదు విడువుము
తరుణీ! నీతల్లడంబుఁ దప్పకతీర్తున్.
తడఁబాటు విడిచి వాఁడె
వ్వాఁడో? పేరెయ్యదియొ? తెలుపు వనజానన! నీ
యుడుకార వాని నిప్పుడ
మడియింతెద నొక్కనిమిష మాత్రములోనన్.
అనుటయుఁ దల్లడం పడుచు
హా! యతనుం డతఁ డేవిధంబునం
జెనకఁగవచ్చు నంచుఁ దనచిత్తము
ఝల్లన మోము వెల్లనై
పనుపడు కంపముం గగురు
పాటు భయంబును దెల్ప సీత్కృతం
బున మెడఁ గౌఁగిలించుకొనఁ
బోయి యొడంబడకున్న సోలినన్.
కనుఁగొని యాదరంబు భయ
కంపములు న్వొఱఁగున్ మనంబునం

బెనఁగొన నేపఁదేరిచి వి
భీతమృగేక్షణ! యిట్లు బేలవై
వినియతవృత్తము న్వదలి
పెంపుదొలంగఁగ లాతివాని న
న్నని కవుంగిలింపఁదగు
నే? యని యించుక మందలించుచున్.
వెడలంగ దివిచి "పడపుం
బడఁతివలెఁ జేరవచ్చి భయమిషమున నన్
నెడఁగౌఁగిలించెదే! నీ
నడవడి యెఱుఁగంగనయ్యె నాతి! చను" మనఁ.
అతనుతాపమున భయార్తనై వేఁడిన
నభయ మిడిన నీవె యవలఁద్రోయ
మరులు వేప జొచ్చె మాటికిమాటికి
నేమిసేయనేర్తు నెందుఁజొత్తు?
ననుఁబొలముంచిన నీ
ళ్లను ముంచిన నీవెకాతలంచుచు నీకే
ల్గాని కౌఁగిలించి దానం
దనుతాప ముడంచికొన స్వతంత్రత లేదే!
అని వెచ్చనూర్చు నయ్యం
గనఁ గాంచి వెఱంగు గదురఁగా నీపల్కుల్
వినవింతలయ్యె గూఢం
బునఁబోవక తేటతెల్లముగఁ దెల్పు చెలీ!

అనినఁ సంతసమంది సుందరమనో
జాకార! నీయాపవ
ర్తనముల్ నామది నాఁచికొన్న నిలువన్
ధైర్యంబు లేకుంట నె
ట్లును నిన్నుం బడయంగలేక యిటు లా
లోచించి నీయొద్దఁజే
రిన దానన్నను నాదరించి మదనా
ర్తింబాపి రక్షింపవే.
అనఘా! మణిమాలయనం
జనుదాసను మాణిభద్రు సకియను నీయం
గన నాదుఁ బ్రీతితోడుత
ననుఁ గూడెదవేని మేలొనర్చెద ననినన్.
హరిహరి! యెంతమాట విన
నయ్యె నయార్యె! యనాథనంచు న
త్వరమునఁ గావుమం చొకనె
పంబున నాయిలు సొచ్చి నర్మవా
క్సరణిని నన్ను బేల్పఱచి
సాహసకృత్యము సేయఁబూనెదే
తరుణిరొ! దీన మేలుగల
దా! వలదా పరలోకచింతనల్?
సకియ! నిన్ను వినఁగ సద్వంశజాత
వనుచుఁ దెలియవచ్చె నకటకట!

అచ్ఛమైన కొలమ్ము నైనఁ దలంపక
మచ్చఁ దెచ్చిపెట్ట వచ్చునమ్మ!
వరసతీధర్మములనెల్ల వఱదఁగలిపి
మనసుబడినేగఁ దగవౌనె మగువలకును?
తామరసనేత్ర! మంచివర్తనమెసుమ్ము
సతులకెల్లను నిహపరసాధనంబు
మదవతి! యింత వెఱ్ఱితన
మా! క్షణభంగురమైన సౌఖ్యసం
పదకయి యక్షయ్యంబయిన
పావనవర్తన మెల్ల వీడఁగా
మదిఁదలపోసె దింక వెడ
మాటలే చెప్పక యొప్పిదంబుగా
సదనముఁ జేరికొమ్ము జన
సంఘము చూడకయుండఁ జెచ్చెరన్.
అదియునుగాక నీపతి ధ
నాఢ్యుఁడు పావనమూర్తి రూపసం
పద మకరాంకుఁడంచుఁ బలు
మారులు వచింపఁగ విందు; నెందునన్
గొదరయొకయింత లేదుగద
కోమలి! లోకములోన నేరికిన్
బ్రదికినయన్ని నాళ్ళను సె
బా సనిపించుకొనంగఁ జెల్లదే!

ఎడఁద నొకంచు మాటలను
నింకొకఁ డక్కట! పాపశంక లే
నడఁచి మెలంగ దేల? యిహ
మం దొకవేళ సుఖంబెయైన యీ
నడవడి మంచిది కాదుసుమి
నాతి! పరంబునైన దీనికిన్
గుడుతు పదింత లెక్కుడుగఁ
గోరకు మిట్టివి తుచ్ఛసౌఖ్యముల్.
మగనాలి విట్లు సేయుట
తగవగునే? మాను మిట్టి తలఁపుల? నింక
మగనిప్రియంబున నెన్నియొ
సుగముల నొందెద వి దేటి చొప్పు? లతాంగీ!
మగనితోఁ గాపురముసేయు మగువ లయ్యుఁ
జెడిపెలై యన్యులను గోరి చెడుచు నుంద్రు
భర్త విడనాడినను మంచి వర్తనమున
గులసతులు గౌరవము నిల్పుకొనరె యెందు?
దీనికిఁ దార్కాణముగా
మానిని! నీకొక్కగాథ మహిమాస్పదమై
పేనులవింటై యొప్పెడి
దాని వచింతు విను సావధానమనమునన్.
ఏనొకకార్యభారము వ
హించి చరించుచు నొక్కనాఁడు దా

రానగరంబుఁ జేరికొని
రాతిరివేళను విశ్రమింపఁగాఁ
బూని పురంబునందు నొక
భూసురగేహము సొచ్చి వారి స
న్మానముఁగాంచి యొక్కశయ
నంబుపయిన్ బవళించియుండఁగన్,
నావెనుక నొక్కముదుసలి
యావెలఁదుక పుణ్యతీర్థయాత్రార్థంబై
పోవుచుఁ దద్గృహమునకున్
నావలెనే వచ్చి నిలిచె; నాఁటిరేయానున్.
"ఎట్టిపాపకర్మ మేఁ జేసితినొ? పూర్వ
మిట్టిధూర్తుఁడైన పట్టి గలిగె"
ననుచు వగచుచుండు నాయింటి బ్రాహ్మణిఁ
గాంచి యిట్లు వృద్ధ కాంతపలికె.
"ఏల వెక్కివెక్కి యేడ్చెదు? నీసుతుఁ
డెట్టివాఁడు? చరిత మెట్టిదమ్మ
యనిన నామెతోడఁ దనయునివృత్తాంత
మిట్లు చెప్పె దుఃఖ మేదికొనుచు.
అంబా! యెట్టిముహూర్తమందు జననం
బైనాఁడొ నాతండ్రి? లో
కంబం దెచ్చటలేనివర్తనములం
గొరించుచున్నాఁడు; జూ

దం బాడస్వానుదీయఁ డెందు ధనకాం
తాసక్తుఁడై యార్యవం
శంబున్ శీలము నెంచకుండు మము మె
చ్చంబోఁడు మూఢాత్ముఁడై.
కన్నకడుపుగాన ఘనమతి యని తెల్పి
మాయఁజేసి యొక్క మంజులాంగిఁ
బరిణయంబు చేసి పాపంబనక దాని
యుసురు వోసికొనఁగ నొడఁబడితిమి.
పరిణయ మయ్యోనేని యొక
భంగిని లోఁబడునంచు నెంచఁగా
బరితెగి సంశయింప కొక
వారలతాంగిఁ బరిగ్రహించి యా
తరుణిగృహంబులోన నె స
దా చరియించుచు నింటఁజేతికిం
దొరకినవస్తుసంఘముల
దోచి యొసంగుచునుండె దాసికిన్.
మూఁడేఁడులయ్యెఁ దనసతి
యీడేరి ప్రియంబుఁగూర్ప నెంచఁడు కట్టా!
కోడలుఁగొడుకుఁ గలయుట
చూడంబడ దెట్టిపుణ్యశూన్యుల మొ కదా.
ఎన్నాళు లూరకుండెద
మన్నా! లోకాపవాద మగుననుశంకన్

మన్మాథుఁడు కోడలిదే
నిన్న నె వియ్యాలవారి నెలవున కరిగెన్.
చూచాయ నెఱిఁగి వాఁడా
నీచాంగనతోడఁ గలసి నేఁ డెక్కడకో
వేచనియె ననెడునాసుడి
నాచెవులను సోఁకెఁ బిడుగు నాఁటిన భంగిన్.
కొడుకు దుండగీఁడు కుటిలాత్మకుండు దు
ష్కృతవుఁ డగునుగాని కేవలంబు
నాకు వానిదర్శనస్పర్శనంబులు
ప్రాణదాయకంబు లగునుసుమ్మి!
అమ్మ! వానిఁ గూర్చి యడలెద; నెన్నఁడు
నెడసి చననియట్టి యేకపుత్త్రుఁ
డవలి కేఁగి దీనుఁడై చరియింపగాఁ
దల్లిప్రాణ మెంత తల్లడిల్లు?
అని విలపించెడునాసతిఁ
గని యూఱఁడు పనుచు వృద్ధకాంత పలికె నో
వనితా! యేటికి వగచెదు
చనునే యీదార్త్య లోక సామాన్యమె కా!
భూపాలశిరోమణులే
రూపాజీవులకుఁ జిక్కి రూపఱుచుండన్
నీపాపం డొకలెక్కయొ?
తాపంబుం దీర్చు నీకథన్ వినుమబలా!

* *

పూ ర్వ భా గ ము :

ధనపుర మనునొకపట్టణ
ముననుండు; ప్రధానమంత్రి పుత్రుండు మహా
ధనికుఁడుచంచలమతి నొ
ప్పినవాఁడై రత్నవర్మ పేరఁ బరఁగుచున్.
చిన్నటనాఁటనుండియును
వెంగలిఁబోలెఁ జరించుచుండుటన్
చెన్నటిచేష్టితంబుల వి
శేషములుం గపటంబు సేయుటె
న్నన్ని విధంబులో యవియు
నిచ్చమెయిం గడు నేర్చెగాని తా
నెన్నఁడు సాధుమార్గమున
కింత యొడంబడఁ డెట్టిపట్టునన్.
దుడుకుఁదనంబులగని యగు
కొడుకునకుం దండ్రి యింత కుడువం గట్టం
దొడుగంగ నిచ్చుటకుఁ దా
నొడఁబడునే కాని ధనము నొసఁగకయున్నన్.
తనతండ్రి మదనవర్మం
గనుఁగప్పి ప్రతాపభూమికాంతుండగు ద్ర
వ్యనిధాను నసితవర్మం
గని యాతనితోడఁ జెలిమిఁ గావించె నొగిన్.

షారిఁబోరి నాతితాయులకు,
భోగముతొత్తులకుఁ, బెడంగుజూ
దరులకుఁ, గొండెకాండ్రకును,
దారుపుకాండ్రకు, ధారుణీపతుల్
తరుచుగ నిచ్చుచుండెదరు
దర్శనమంతియకాని, కావ్యశే
ఖరులకుఁ బండితాళికి మొ
గంబును జూపరు దుర్మదాంధులై.
మాటలయందలి పటిమయు,
నాటలలో నేర్పుఁగాంచి హర్షాత్మకుఁడై
గాటపుఁగూరిమిని. నిరా
ఘాటంబుగ నతని మంత్రిగా నొనరించెన్.
మదనసుకుమారుఁ డసితవర్మప్రభుండు
వనజదళనేత్రధనరూప యనెడువార
కాంతభోగినిగాఁ జేసి కరము దాని
సదనమున రాకపోకల జరపుచుండు.
రంగద్గతిమీరువయ
స్సంగతి తను నొంచుచుండ జాణతనముస౯
శృంగార మెడలకుండఁగ
బంగారము దోచుచుండె వారాంగనయు౯.
ఎల్లప్రాయంబున రూపసంపదను హా
యిుంగూర్పు గానంబునన్

వెలయాంధ్రదండకము మించి చూపవలక
న్విండై భుజంగాళికిన్
వలయై యూపణికాభిధానయొక యూ
పాజీరత్నంబు దా
నలరారున్ ధనయూపపెంచికొనఁగా
నాయింట లీలాగతిన్.
వెతవోవు నని యేమొ! విటకాంద్రు చెలరేగి
కలువపూవులదండ గట్టినారు
కొదవ'యుననియేమొ! కోడెకాంద్రు తెగించి
పుత్తడి కరువుగాఁ బోసినారు
వగతగ్గుననియేమొ! వన్నెకాంద్రు చెలంగి
చిత్రలేఖనములఁ జేర్చినారు
తమిదీరుననియేమొ! తావికాంద్రు భ్రమించి
వలపుపాటలలోన నిలిపినారు
కలికివాల్జూపుకోపు, మేగరగరికయు
నవనవోన్మేషశకావనోన్నతియు, హావ
భావచేష్టావిలాస సంపదయుఁ గాంచి,
పణ్యనతి యెంతొ? యౌవన వటిమ యెంతొ?
నరసాగ్రేసరుఁడును సుం
దరుఁడై తగు రత్నవర్మ దానిన్ విని న

త్వరఁబడై చని రూపణికం
గరఁగించె ధనప్రధాన గౌరవములచేన్.
తానసితవర్మయొద్దఁ బ్ర
ధానుండగుటయును, ధనముఁ దాచుటను లో
లోనం బొంగుచు నాచం
ద్రానన వలపించి వలచినట్టుల యుండెన్.
అతఁ డిట్టులుండుటసితవర్మ యెఱుంగ
కతఁడె తనకుఁ దగిన యల్లుఁ డనుచు
దలఁచి మంచివేళఁ దనయేకపుత్రిక
నొసఁగి పెండ్లిచేసె నెసక మెసఁగ.
రత్నవర్మ తన్ను రాజ్య మొందెడునను
నాసఁజేసి పెండ్లి యాడెఁగాని
అనుపమానరూప యనురూపపై నింత
యేని వలపుమాట యెఱుఁగఁ డకట!
భావిప్రభుఁడును, బ్రస్తుత
భూవిభుజామాత, యనుచు మునుపటికంటెన్
భావంబుఁ దనుపుచుండి ర
హో! వారాంగనలు కప్పయలుకుడుపాముల్.
అట్లుజరుగుచుండ ననురూప నవయావ
నాంగియగుటఁ దలఁచి యసితవర్మ
వెనుకవట్టు బెంచి ధనరూప తనకూఁతుఁ
జేరి పలికెఁ బెద్ద యారటమున.

పెద్దరాజు మాట పెద్దటికమొ కాని
కాసులిచ్చునన్న యాన లేదు;
మనకు రత్నవర్మ మనుజేశుఁడైన బం
గారుతోడ నిల్లు గట్టుమొక్కొ!
అది కోరుచునుండంగా
నెదిగిన దనురూప రాజు నిల్లే యుండెన్;
సుదతీమణి యనురూపం
గదిసినచో రత్నవర్మ కాంచునె మనలన్?
అదిగాన ముందుగా నసితవర్మ ప్రభుఁ
బంపునుద్యోగంబు నలుపవలయు
నయ్యనంతరము రాజగు రత్నవర్మపై
నరిలేసికూరిమి నెరపవలయు
నట్టిపైన నెట్టులైన ననురూపపై లేని
యపవాదములు దోఁప నాడవలయు
నదికారణంబుగాఁ బెదరునాతనిఁ జేరఁ
దీసి లోఁబఱుప యత్నింపవలయుఁ
దుదకు మనమాయలం బడఁ ద్రోసి చేతి
సొమ్ముఁగైకొని మెలపునఁ జోఁపవలయుఁ
గూఁతురా! వింతలే యిట్టి చేతలెల్ల
నంగతోఁ బెట్టినవియె వారాంగనలకు.
అని తన దుర్ణయంబు వెర
వారఁగఁ దెల్పినతల్లిమాటకున్

వనజదళాక్షి రూపణిక
భావములోపలఁ బొంగి యంతలో
ననె కయిసేసి సంతసము
నం జనుదెంచిన రత్నవర్మనుం
గని వియంబుతో నెదురు
గాఁ జని కౌఁగిటఁగూర్చి నేర్పునన్.
పానుపునఁ జేర్చి విడెమిచ్చి తేనెలొలుకు
పలుకుబడితోన కూరిమి వెలువరించి
యింతతడవైన నోర్తునే కాంత! యనుచు
నిచ్చకములాడుచుండిన యెడ రెటింగి.
ధనరూప వచ్చి దండం
బును బెట్టినదై సమీపమున నొకపీఠం
బునఁ గూరుచుండి విన్నం
దనమొందినమోహముతోడఁ దా నిట్లనియెః
అక్కటకట! మీర లాలకించిరొ, లేదొ,
కాని మాకొలంపుఁ గాంతలెల్ల
రత్నవర్మలోభిరాజని దూరంగఁ
జొచ్చి రేమిచెప్పఁ జూచుదాన?
రాజునల్లుఁడైన రత్నవర్మకుఁ గూర్చు
సాని నైతినన్న సంబరంబె?
చనునె యెదురువెట్టి చదరంగమాడంగ
రూపణికకు? తాను రోవెలఁదియె?

అని నిందించుచు నుండఁగ
వినసేరము గాని భావవేదులరా మి
మ్మనసి చరించుట చాలదె?
ధనమూ బానిస గడింపదా! యద్దానిన్.
వారితోడనేమి పని యని మది నరి
పెట్టుకొన్నఁగాని వెడఁగుమాట
లాడు టంతకంత కగ్గలం బయ్యె లో
కంబు నెల్ల మూయఁ గలము మనము?
అనవుడు రత్నవర్మ హృద
యంబునఁ గొండొకసేపు యోచనన్
బొనరిచి వేశ్యమాత మొగ
ముం గని యిల్లన నోపడంతి! యే
యనువున నిట్టినింద మన
యందుఁ దొలంగునొ యట్టి దాని నె
మ్మనమునఁ గాంచి చెప్పు మన
మానిని వానిని జూచి యిట్లనున్.
మనకు నసితవర్మ మనుజేశుఁడై యుండు
వఱకు నిపుడుగల్గు వాదు పోదు
లోకనిందలకును లోఁబడ వలసె నీ
యట్టివానిచెట్టఁ బట్టి యుండి.
నలువుర నోళులం బడి మ
నంబునకుం బదిలంబు లేక యి

య్యాలవున నెన్ని నాళు లడి
యూనఁ జరింపుదు? మేమి గల్గు నా
వల, పరికింపు మయ్యసిత
వర్మ నెపంబునఁ జంపి రాజ్యముం
బలిమి గ్రహింతుమేని కొదు
వల్ గలవే మన కెట్టిపట్టునన్?
కావున నాతని జంపం
గా వెరవూహింపు మంతె కా కిటు దినముల్
పోవంబోవఁగ నేగతి
గావచ్చునొ యంచుఁ బలుకఁగా నతఁ డనియెన్.
నేనట్టిపనిని జేయం
బూనఁదగవుగా దిఁ కెంత ముదుసలి యయ్యెన్
దానుగ నేడో రేపో
చానున్నాతనికినై విచారము లేలా?
అని వచియించెఁగాని యతఁ
డాసతిపల్కిన పల్కులన్నియున్
మనమునఁ బెట్టి వారివల
సం గడ తేరెడు నాతఁడంచు మో
దనియతి వారితోడ నిది
ధర్మవిరుద్ధపథం బటంచు శా
సన మొనరింపకుండె; నది
సమ్మతిగాఁ గొని రాగయాళులున్.

వెనుక నచిరకాలమునకె చిత్రంబుగా
వాంతిభేది నసితవర్మ కాల
వశత నొంద రత్నవర్మ యప్పట్టున
నతని రాజ్యమెల్ల నాక్రమించె.
"వారకాంత యెంత దారుణం బొనరించె!
నెఱిఁగి రత్నవర్మ యూఱక యుండె
నసితవర్మ యా గయాళిచేఁబడి చచ్చె"
ననుచు నొకప్రవాద మయ్యె భువిని.
తెగనీల్గకుండఁగఁ దెల్లవారినదాఁక
మరణింపఁగా నల్లమందువెట్టు
విడనాడిపోక యేవేళను దనయిల్లె
మఱఁగియుండఁగ మచ్చుమందువెట్టు
అనుఁగుటిల్లాలి మాటాడిన నొడలెల్ల
మంట లెత్తఁగ మాయమందువెట్టు
అవసరంబైన ద్రవ్యం బెల్ల హరియించి
మడియింప గరళంపు మందువెట్టు
వాదు లూరక పుట్టునే? పణ్యకాంత
రాజునే చంపునా? యనరాదు మనకు
వారకామిని పట్టిన వారిబ్రదుకు
బండయై యిల్లు గుల్లయై మండిపోదె?
పుడమి యొడయఁ డగునాతని
యడుగులకు న్మడుగు లిడుచు నతి వినయమునం

బడపుచెలి గడుసుఁదనమున
గడెక్కొకతీరున మనంబుఁ గలఁచుచు నుండెన్.
“నరనాథ వారాంగనల పొత్తునం జేర
వల”దని తెల్పెడు వారు లేక
“అనురూపయగుసాధ్వి ననురూప విడువఁ బా
పంబుగాదే”యను వారు లేక
“ఆయంబునకు వెచ్చ మధికమయ్యె నిదేటి
పని”యంచు నడిగెడు వారు లేక
కులమువారలలోనఁ దలవంచుకొనఁగఁ జీ
వాట్లను బెట్టెడు వారు లేక
రత్నవర్ణ దా నిరంతరమును వెల
వెలఁదియింట నదరు బెదరు లేక
నిలిచియుండి దాని పలుకు వెంబడి నేగుఁ
గాని దానిమాయఁ గానఁ డకట!
వెచ్చము తగ్గునంచు మిష
వెట్టినదై యనురూప యెంతయున్
ముచ్చట దీరఁ బ్రాణవిభు
భోజనవేళను నైనఁ జూడఁగా
వచ్చు నటంచు నాసపెయిఁ
బాకవిధాననిధాన గాన లో
నచ్చపుఁబ్రేమఁ గాంతునకు
నన్నము తానె యొసంగు నిచ్చలున్.

నప వగునంచు భోజనప
దార్థము లొద్దనె వేచ్చి యుండ నా
పసుగలుగు భవ్యభక్ష్యముల
నైనను; శుద్ధజలంబుతోడఁ దాఁ
గడిగిన పాదమందు నర
కాల్తడియారకయుండ నెట్టిటో
వడిగ భుజించి చేదొలఁచు
వారలతాంగిగృహంబులోపలన్.
ఒక్కొకవేళ జాగయిన
నోపక మాసినచేలతోడనే
వక్కలు నాకులుం గొనక
వాఁ డరుగంగఁ బ్రియానురూపయా
నక్కనకాఁగి కూర్మిమెయి
యం దనకాంతుని గూర్చి దాసిచే.
నక్కడ కంపుచుండుఁ దెల
నాకులుఁ బోఁకలుఁ జల్వవల్వలున్.
ఎలఁబ్రాయపుఁగలికి ప్రియుం
గలయు చెఱుఁగ దంతెకాక కనులారఁగ వా
రలతాంగుల మఱఁగుటే గని
చెలువుని నిందింప దెట్టి శీలంబో కదా!
మఱియొకనింత! యంత వెల
మానిని త్వ త్వివహింపలేక "య

ద్దిర! యనురూప యాతనికి
దేవిగనుండిన యంతకాలమే
మరి యెటులుండవచ్చు; నస
మానము దానిమనోజ్ఞరూప మా
తరుణిప్రియంపు సేఁతల క
తం బెపు డేగతి మాఱి పోవునో.
అది సాధ్వి, యనువ్రత, నె
మ్మది నిష్కపటంబుగలది, మానిని, దానిం
గదిసినయంత వివేకము
పొదలిచి మనయందు రోత పుట్టింపదొకో!”
అనియూహఁజేసి యొకదిన
మునఁ దడవుగ నేగుదెంచు ముగ్ధుం డగునా
తని బెదరుగదురుచూడ్కులఁ
గని కౌఁగిటఁ జేర్చి పట్టి కల్లభయమునన్.
అకట మనోహరాంగ! తడ
వై నను నీచనుదెంచుదాఁక నా
కొకనిముసంబె యేఁడగుచు
నుండు; నయో! పులియున్న కోనలో
నికిఁ జను లేఁడిపిల్ల వలె
నీవు గృహంబున కేగి గాసినొం
దక చనుదెంచు టేనది పు
నర్జననంబుగ నెంచుచుండెదన్.

తనతండ్రి మాయచేఁ జం
పనచూచిన మనలఁజంపి పగఁదీర్చికొనం
దనమది నాలోచించిన
దనుజూప; యిఁకెట్లు దాఁటనగు నియ్యెడరున్?
తెల్లనివిపాలు నల్లని
వెల్లనునీళ్ళనుచుఁదలఁచె దీవేమియు నా
యల్లిక లెఱుఁగవు గుండెలఁ
దల్లడపా టొదవె నేమి తాళ్కొనునోకదా!
ఇటు వినవౌర నీచెలువ
యెంతటిమాయలమారి నీకునైఁ
యటమటఁ జేసి మొన్నవిడి
యంబును బంపిన దేమిసెప్పఁ గు
క్కుట మొకవక్కఁ మ్రింగఁగనె
కూయుచు మార్మెడవెట్టి నేలపైఁ
దటుకునఁ గూలె నిట్టిదిగ
దా! కులకాంత యనంగ నద్దిరా!
అని యెత్తువెట్టి వారాం
గన యాంత్రనికరమువట్టి కళవళపడుచుం
దనవక్షంబునఁ జేరిచి
కనుమనెఁ గృత్రిమభయంబు గంపముఁగదురన్.
అది నిక్కంబని యావెడంగు "భయమే
లా బాల! యిన్నాళ్లు నీ

మదిలో డాఁచెదవే! ప్రమాదముగదా
మజ్జారె! మేలయ్యె నా
పదలం బోవకయుండ; నియ్యెడరు మా
న్పంజూడఁగా నిప్పుడే
యద" నంచు న్మరలెం గిరుక్కు-మని దీ
ప్తాగ్నింబలె న్మండుచున్.
చని కోపంబున "నోసి దుష్టహృదయా!
చాల్చాలులే! తేనెబూ
సినకత్తింబలె నుండుటల్ తెలియుచ
చ్చెం బిల్లి కన్మోసి పా
ల్గొనినం జూపరెఱుంగ కుందురె! మ
త్క్రోధప్రతాపాగ్నికిం
ధనమై పోవక పొమ్ము నీమదికి యు
క్తంబైనమార్గంబునన్.
నినుఁజూచినఁ బాపంబగు
ననుమానించుచును నిల్వకటు పొమ్ము నయం
బునఁ బోవకుంటివేనిం
గినుక వాడమకుండ దింక గెంటింతునుమీ."
అనినం దల్లడము, భయం
బును, సంతాపంబుఁ, గంపముం గని విన్నం
దనమునఁ దలవాంచి మనం
బున శోకాగ్నిబడి యూర్పు పొగ లెగయంగన్.

వెరగంది యధికదుఃఖా
తురయై నన్ను నియెలుంగు దొట్రిలగ మనో
హర! యేమిపాప మిది న
న్నులక తెగడి వెడలనడచు టొప్పునె యకటా!
అని పాదంబులపైఁ బడు
ననురూప నదల్చి పడపుటాలివచనముల్
మనమునకుఁ దెచ్చి క్రోధం
బున గేహమునుండి వెడలి పోవఁగఁ జేసెన్.
కడఁ సుకుమారి యాగర్భశ్రీమతి
రమణీయతరమూర్తి రాచబిడ్డ
కన్నులు తెఱవని కసుగాయ యొండక
న్నెఱుఁగక పెరిగిన యింతిమిన్న
అంతఃపురార్హ యా నబలాశిరోమణి
కాయకష్టములకుఁ గానిపూవు
పతిదైవముగ నెంచు పరమపతివ్రత
అమలచరిత్ర పుణ్యములపంట;
యనక వెలయాలి కపటవాక్యములవలన
నంకురించిన క్రోధాగ్ని నార్పలేక
యనుఁగుటిల్లాలిఁ ద్రోసిన యట్టిఖలుఁడు
శోకనిందలఁ బడి చెడి పోకయున్నె?
"జనకునికన్న మున్నెగనె
స్వర్గముఁ జేరిన దంబ, దండ్రియుఁ

జనెఁగడ యత్తమామలును
సన్నిహితుల్ గలరింక నైన నే
మని చరియింతు వారికడ
నక్కట! ప్రాణవిభుండు వాయునం
గన కెవరాప్తులయ్యెద? ర
కారణవత్సలుఁ డీశ్వరుండె కా
దిక్కగు" నని ధైర్యంబును
జిక్కంబట్టికొని విభుని నేతలవలనన్
మిక్కిలియగుచింతాభర
మక్కంజేక్షణమానంబు నారటఁ బెట్టన్.
"ఈశ్వరానుగ్రహంబున నెట్టిదైన
నామనోనాయకుండు సన్నోక్షముఁ గాంత
కాలవశమున జీవులఁ గలఁచుఁగాని
యాపదలు కాపురముసేయ"వని తలంచి.
ఆసాధ్వి తనకు దైవాపదేశంబునఁ
గడ కిట్టియాపదో కలిగె ననుచుఁ
జింతించి తనకూర్మి చెలులు సుబుద్ధి భా
గతియునుఁ దోడరా నతివిచార
మున రత్నవర్మ నెమ్మనమున నిలిపి దై
వముచేతలకుఁ గడు వగచి వగచి
"యోయమ్మ యెండలో నుంటివి నీడకుఁ
జేరు"మంచును బిల్చువారు లేక

తఱిని నిద్రయు నాహార మెఱుఁగకుండ
ధరణి నెచ్చెలికవ తోడఁ దిరిగి తుదకు
నొక్కయెడఁ జేరి శీలంబు నుద్ధరించు
కొనుచునుండెను మది వగఁ గుంది కుంది.

అనఘపతివ్రతాగుణ స
మంచితవిగ్రహ మైనయట్టియం
గన యనసూయాసచ్చరిత
గానము సేయఁదగుంగదా! జగం
బున నటువంటిసాధ్వికి న
మోఘముగాఁగ నభీప్సితంబులన్
బొనరుపకున్న దైవము
మూఘునిగాఁ దలపందగుంగదా!

అని చెప్పి యట్టివారే
మనమున వెలయాంధ్ర సమ్మె మరియాదఁ ద్రోలం
గినవారు గాదె! నీసం
దనునకు వగవకుము వాఁడె తెలుఁగు నెఱిఁగినన్.

వగచి యేమిచేయవచ్చుఁ? బురాకృత
కర్మసరణి నరుగుఁ గాదె! జీవి
యెఱిఁగియెఱిఁగి యెవ్వఁ జేసియుఁ జెడఁగోరి
కొని తనంత దెచ్చికొనునె యెడరు?
అని ప్రసంగవశమునను జెప్పెనీకథ
నందెయుండి వింటి నతివ! నేను

మనమునం దలంపు మనుయాప నాసతి
దారిఁబో మ్మిదేటి తత్తరంబు?
తననాథుండు పరాంగనాభిరతి ని
ర్దాక్షిణ్యుఁడై త్రోయఁగా
ననురూపాంగన సాధుశీల యగుచుం
బ్రాణేశుఁడే దైవమం
చును బూజించుచునుండ లేదె
సుదతీ! చూడంగ నీభర్త నీ
వనిశం బ్రాణముగాఁ దలంచికొను క
ట్టా! యేల నీకీపనుల్?
అన విని తెల్లంబోయియుఁ
దనయునికి నెఱుంగనీక తహాతహా మీఱన్
వనజాతనేత్ర పూరుషుఁ
గనుఁగొని యిట్లనియె సుప్రకాశఫణితిచేన్.

*

ఉత్తరభాగము:
అనఘ! త్వదుక్తమై తనరు
నట్టి యపూర్వకథావిధాన మిం
తని వచియింపరాని ముద
మందఁగఁజేసెనునన్ను; రత్నవ
ర్మ నలపతివ్రతామణి క
రంబు విచారముతోడఁ బాసిపో

యినతరువాతిగాథ వచి
యించెద నీకథ నుత్తరంబుగన్.

మత్ప్రియుం డొకనాఁడు మధ్యాహ్న భోజనా
నంతరంబున వినోదైకలీల
సకలదేశవిశేష సంగతుల్దనచెంత
కరుగుదెంచిన విప్రవరులవలన
వినుచుండ నచటికిఁ జనుదెంచె నొకవిప్ర
సూనుండు వాని సన్మానలీలఁ
బరితోషితునిఁ జేసి బంగారుగద్దియఁ
గూరుచుండఁగబెట్టి కుశల మడిగి
బుధజనాగ్రణి యేదేశమున నివాస
మేమి నామంబు మీరిట కేగుదెంచి
నట్టికార్యం బదెయ్యది యానతీయ
వలయునని వేఁడఁ బ్రియుఁగాంచి పలికె నతఁడు.

మానివాసంబు జగతిని మానివాస
మగుప్రతాపపురంబగు నార్యవర్య!
పేరు మతిమంతుఁ డందురు పెద్దలెల్ల
లౌకికాచారమున నే మెలంగుచుండి.

ఆప్రతాపపురీశ్వరు నాశ్రయమున
వానిప్రాణంబునకుఁ బ్రాణ మైన వాఁడ
విధివశంబున నారాజు వేశ్యమాయఁ
గూలఁబడి యాత్మధనమెల్లఁ గోలుపోయె.

ఎందో యడఁగఁగ నాతని
కందువఁ దెలియంగ లేక కడు దుఃఖమునన్
బందవలెఁ దిరుఁగుచుంటిని
మందుఁడనై యిందు నందు మహి నెల్లెడలన్.
అనవుడు రత్నవర్మ యిటు
లానె నె యక్కట! వాని కేను న
చ్చినచెలికాఁడ నిర్వురముఁ
జిన్నటనుండియు నొక్కమేనుగా
ననయము విద్యనేర్చితిమి
హా! విధిచెయ్దము లిట్టివయ్యె నే
మనఁజను నింతలోనిదిగ
దా సిరి! దీనిని నమ్మఁజెల్లునే?
నానాథుం డీరీతిని
ప్రాణస్నేహితుఁ గూర్చి పలవింపంగాఁ
దానతని నూఱడించుచు
మానితవర్తనుఁడు ధైర్యమతి నిట్లనియెన్.
అనఘా! చింతల నేటికి
మనవశమే విధికృతంబు మరలింపఁగ నె
వ్వని కెట్లు!వాసె నాయమ
తన పొందక చన్నె ప్రాణధారుల కెల్లన్?
అనవిని వాని కిట్టులను
నయ్యది యట్టిదయౌను గాని నా

మనమున సంతేయు న్వాగవు
మానదు మిత్రున కింతక గ్గెఁగా
చెనటుల రోవెలందులవ
శీకరణౌషధమంత్ర శ క్తి యీ
యనువున లోకులం జెరవు
నట్టె! మహాద్భుత మేమి సెప్పుదున్?
అంతటిమంత్రిస త్తమున
కాత్మజుఁడై యలవేఁగి దేశభూ
కాంతుని కల్లుఁడై క్రమము
గా ధరణీభరమూని లోకము
త్యంతము సంతసింపఁగఁ బ్ర
జావలి నేలెఁడునట్టివాఁడె వి
భ్రాంతమనస్కుఁడై చెడెనె
వారసతీకృతమాయఁజిక్కుచున్?
కరము దదీయచింతఁ బరి
కంపితమానసుఁడై నవాని భూ
సురవరులెల్ల మానితవ
చోనిచయంబుల నూఱడించి యి
ట్లురక విషాద మొందఁజన
దూఱడు మాయవివేకిఁ చేఁతలన్
గరమువిచార మొందియెడ
గాఁజనియుండదె వాని సాధ్వియున్.

నావిని యొట్లెటులూ! సుజన
నందిత యాయనురూపకూడ దుః
ఖావిలచిత్తయై పురము
నవ్వలి కేగెన దిక్కుమాలి? ప్రా
ణావనుఁడై నభర్త విడ
నాడ నహా! సుకుమారియైన య
వ్వావని నిట్టికష్టములఁ
బాల్పడఁజేసెనె ధాత యేమనన్?
ఇటు దురపిల్లగ విని చెం
గటివిప్రులు పలికి రిట్లు కరుణామయ! యే
మిటి కిట్టు లడలె దాచె
న్నటికష్టదినంబు లడలు నాపైఁబడగన్?
అనిమతిమంతుఁ గాంచి యన
ఘా! వినియుంటిమి రత్నవర్మ పా
వనియగు నాత్మజాయ నల
వారవధూకృతబోధనంబులన్
విని విడనాడె నంచు నటు
పిమ్మట రాజెటుసంచరించె నే
యనువున వానిఁబోనడఁచె
నావెలబోఁడియు బోఁడిజేయుచున్?
నావిని పల్కె భూమిసుర
నందనుఁడో జనవందనులార! మా

యాపిని నీచవర్తనయు
నైన ధనాంగన దుష్టచేష్ట లి
ష్టీవిధియించుఁ దెల్పుటకు
నేవ జనించెను నైన నాకు మీ
భావ మెలర్చుకంటె మఱి
పండువలే దటుగానఁ జెల్పెదన్.

నృపతియు నటు వేశ్యాకృత
కపటం బెఱుఁగంగలేక కాంతను విడి రా
జ్యపుఁబనులఁ జూడనొల్లక
విపులానందమున నుండె వేశ్యాగృహమునన్.

అట్టివాని చెయ్దంబుల కాత్మఁగుంది
వాని నొక్కటి వేఁడితి ప్రాణమిత్ర!
నన్ను నొకవేళతప్ప నీవున్నయెడనె
యెప్పుడును నుండఁగా జనవీయు మనుచు.

మిత్ర ప్రేమంబుననా
ధాత్రిపుఁడును దాని కొప్పె ధనకాంతయుఁదాఁ
జిత్రప్రకియ లీలా
మాత్రంబున నతనిఁ ద్రిప్పు మాయావతియై.

ఒయ్యారముగఁ దన యోరపయ్యంటతో
నొకవింతగా నిలుచుండువగయు
బెళుకుచూపులతళ్తళ్ళలచే నుల్ల మ
ల్లలనాడఁగాఁ జేయు విలసనంబు

పలుకుపల్కునఁ దేనె లొలుకంగ వల పుట్టి
పడ మాటలాడెడు గడుసుఁదనము
చిరునవ్వు మోమున మెరయఁ గైదండ యొ
సంగి లోనికిఁ గొంచుఁ జనెడునేర్పు
గడియ కొకవింతసొబగుగాఁ గానిపింప
రూపణిక చేతిజంత్రంపు రూపువగిది
దాని చెప్పెడుమాట వేద్యం బటంచుఁ
దలఁచుచును రత్నవర్మ దా వలచియుండి.

వాలఁదివిభ్రమ మెంచి విఱ్ఱవీగును గాని
తన కది మత్తుమం దనఁగఁబోఁడు
అతివవాక్యావళి నమృతంబె యనుఁ గాని
తన కది విషముగాఁ దలఁపఁబోఁడు
కొమ్మముంగురు లెంచి కులుకుచుండును గాని
తనకు సంకెలలుగాఁ దలఁపఁబోఁడు
ముగుదరూపము నెంచి ముదము నొందును గాని
తన కది చేటుగాఁ దలఁపఁబోఁడు
వనితచిరునవ్వు వెన్నెల యనును గాని
తన్ను దహియించు నని యాత్మఁ దలఁపఁబోఁడు
కలుగునే దూరదృష్టి యక్కాముబారి
గొఱియలై చెడుమందులకును ధరిత్రి?
ప్రమదం బొందుచు నాతఁ డొకటిలరూ
పాజీవమాయాప్రచా

రహఃస్థలిం జిక్కి తదీయసన్నిధియె మా
సప్రాజ్యరాజ్యంబుగాఁ
దమి నూహించుచు రాజ్యచింతలకుఁ జి
త్తం బింత పోనీక వి
త్తముసెల్లన్ వ్యయ పెట్టఁగాఁ దొడఁగె మి
త్రవ్రాత మార్తింబడన్.
ఆలీలన్ నరపాలకుండు తనద్ర
వ్యంబెల్ల వేశ్యాంగనా
లోలత్వంబునఁ బాడుచేయఁ గనినా
లోఁ గొంత చింతించి "యి
ట్లేలా దుర్వ్యసనంబు నొంది కృతమిం
తే నెంచ వీవేశ్య నిన్
జాలింబెట్టెఁదదీయవిత్తహారిణో
చ్ఛాకోలయై కానిచోన్.
నిక్కంబుగ నిది వలపునఁ
దక్కినదియొ? యిట్టివెడఁగుఁ దనమేలా? న
న్నొక్కనిన నమ్మియుండిన
దక్కుమ లేక్షణ యటందు వది తగవగునే?
నీకడ సర్వస్వమ్మును
జేకొని నిజశక్తిఁ జూపుఁ జింతింపవయో!
లోకమున వేశ్యవలపును
గాకితెలుపుఁ గలదె యిట్టి కలవరమేలా?"

అని రహస్యవృత్తి నాతనిఁ దగురీతి
బుజ్జగించి పలుక మూర్ఖుఁ డగుచు
ప్రాణమిత్ర! జగతిఁ బడవుఁబడంతుల
దారి వేఱు దీని దారి వేఱు.

నే నొకనిముసము కంటికిఁ
గానంబడకున్న నిలువఁగానోపక నన్
ధ్యానింపుచు నాకొమ్మ య
నూనంబుగ మదనుచేత నొచ్చుచునుండున్.

తనువీడి తడసిన తనుతాప మోపక
సగమై కృశించు హెచ్చరిక లేక
అనయంబు నారాకకై నిరీక్షించుచు
ద్వారంబుకడ నుండి తొంగిచూచు
పలుమాఱు నావాక్యములె వారిస్మరణగాఁ
జెలులతో ముచ్చట ల్సలుపుచుండు
నెల్లవిధంబుల నేన దైవంబని
సరిలేనిభక్తిఁ బూజలు ఘటించు
రమణి నాకుఁగా నిజశరీరం బొసంగె.

దాని మోహప్రవృత్తంబు దానిభక్తి
దాని యుపచారవిధులు నెద్దానికుండు
దాని మఱవకయుండుటే మేని ఫలము.

అదిగాక యట్టిసుందరి
వెదకిన నెందైనఁ గలదె? విరివిల్తున కౌ

మదిరాక్షిపొందు కలుగమిఁ
గద యతనుండయ్యె సిగ్గు గదిరినవాఁడై.
ఏతాదృశరూపవతిన్
శాతోదరి నకట! విడువఁ జాలుదునే? వి
ఖ్యాతచరిత్రలు కులసతు
లీతరుణికి వర్తనమున నెనవత్తురశే!
అయ్యది యెట్లు చెప్పఁగల
వంచును బ్రశ్న మొనర్చెదేని నే
నియ్యెడఁ జెప్పువాఁడఁ దర
ళేక్షణ మేలిగుణంబు విన్నచో
నియ్యుపదేశ మేమియును
నీయ వటంచుఁ దలంతు నొక్కనాఁ
డయ్యలివేణి నాయునురు
లాదట నిచ్చె నిజప్రభావతన్.
పేరునకుమాత్రె మనుహూప యూరుదిబ్బ
దానిపేరుదలంచిన తలఁకు వచ్చు
నేను దారంబుగట్టిన నెలఁతయంట
వినవె దాసిచరిత్రంబు వెలువరింతు.
ఈకాంతామణి, నేనును
నేకంబై యాత్మజనకు నీల్గించితి మం
చాఁకరము నొంది నాయెడఁ;
బోకర్ల నిన్న మంచి తముటముస్ బుత్తెంచెన్.

నాకపకృతిఁ జేసినసతి
నాకులసతి యనుచుఁ దెల్ప నౌన జనించున్
లోకమునకైన వెఱవని
యాకూళను భర్తృహంత యనఁ జెల్లదొకో.
శోక విష ముంచి యాలీలఁ బోలఁతి పంప
నీమె ప్రజ్ఞావిశాలయై యెసఁగుకతన
దాని నింతలో గ్రహియించెఁ గాని పిదపఁ
గుక్కుటము దానిఁ గొని నేలఁ గూలె నంత.
అది నేవచ్చినపిదపఁ
మదిరాయతనేత్ర నాకు మదిఁగొంకుచుఁ జె
ప్పఁదగనిదై నను నెట్టెటొ
సదయత నెఱిఁగించె నిద్ది సాధ్వియ కాదే!
కొలవునకియ యట్లు కూళయై చరియించె
వెలవెలంది ప్రాణముల నొసంగె
వలయునెడల ధనము వాంఛించునే గాని
వలపుపట్ల వేశ్య ప్రాణమిచ్చు.
కావున నీవిమలాంగికిఁ
గా వేఱువిధంబుఁ దలఁపగాఁ దగవగునే?
యీవెలఁది వీడి యుండిన
జీవింపగ నోప గడియనేనైన సఖా!
నీ వ్రాకలతు చెప్పినను
నే విననోపను దన్నిమిత్తమె

జనన మిత్త్రనన్ను నకే
చేతనె యచ్చ్యుడి యీయఁగాఁబడెఁ
గావున నెన్నిజన్మములఁ
గాంతఋణంబును దీర్పనేర్తు నే
నావిధిఁ గోరి యీశ్వరు న
నంతునిఁగూర్చి మ్రొక్కుచుండెదన్.
నీవు మిత్త్రుఁడ వౌటచేఁ గావలసెఁ
గొమ్మ విడనాడు మని చెప్ప కుటిలహృదయుఁ
డగినరీతిని దండింపఁ దలఁచి యుంటిఁ
జనువొసంగితి నని యిట్టు లనఁగఁదగునె
అనవుడు విన్నంబోయియు
జనపతి కది తెలియనీక సమయజ్ఞుఁడనై
వినయమున స్వీకరింటిని
ననువగుకాలంబు రాదె యనునానమెయిన్.
అంతట నొకనాఁడు మహీ
కాంతుఁడు రూపవతిఁ గూడి కలితోద్యాన
ప్రాంతంబున విహరించుచు
నింతికి నిట్లనియె హర్ష మిగురొత్తంగన్.
నిను నొక కొన్నినాళ్ళిచట
నిల్పి విదేశము పోవవచ్చె మ
జ్జనకుని యాజ్ఞ నిప్పు డటు
సాగక తప్పినఁ గార్యభంగమా

వనజదళాక్షి! శీఘ్రగతి
వచ్చెద దీనికిఁ జింతనొందఁగాఁ
జనదని తెల్పఁ గృత్రిమవి
షాదమునూని నెలంతతో నిట్లనుకా.
చన దిటు, నిన్నుఁ బాసి నిను
సం బొక యేఁడుగ నెట్లుపుత్తు? న
న్నను గొనిపొమ్ము వెంటనె మ
నోహర! యందునకీవు సమ్మతిం.
పనియెడఁ గ్రూరుఁడైన మను
బారికిఁ జిక్కి వియోగతాపవే
దన నినుఁ గ్రమ్మఁజంగఁ గను
దానవొ లేదొ భయంబు తోఁచెడికా.
ఇన్ని దినములనుండియు నెన్నఁడైనఁ
బ్రాణనాయక! నావజ్జఁ బాసియుంటె?
తగనిపయనం బిదేటికి దాఁపురించె?
నొంటికత్తియ నేనెట్టు లుందు నింక.
నామనోనాథ! నీ చిఱునవ్వువెన్నె
లలను గ్రోలక చూపువెన్నెలలపుల్గు
లేకరణి నైచు? నీయాననేందుఁ గనక
కనుఁగలువ లెట్లు వికసింపఁ గలుగుఁ? జెపుమ!
కలికి యీరీతిఁ గపటశోకంబు నెఱప
నదియు నిక్కంబటంచుఁ దానాత్మఁదలఁచి

పతియుఁ బయనంపుమాట నప్పటికిమాని
పొలఁతి మరుమాట నొకరీతి బుజ్జగించి.
అవనిపతి మరునాఁడు కాల్యములఁదీర్చి
రూపణికచెంత కేగి సల్లాపగరిమ
నతివ! నేఁబోయివత్తునా యనుచు నడుగ
వలదు వలదంచు వాని కవ్వనిత పలికె.
ఆహరిణాక్షి వాక్యముల
కడ్డము చెప్పక తాఁ బ్రయాణస
న్నాహము చేయుచుండఁ గని
నాతి నిజంబుగఁ దద్వియోగచిం
తాహతిఁ జేసి మూర్ఛపడి
నట్టుల నేలకుఁ ద్రెళ్ళ నెచ్చెలుల్
బాహుల నెత్తి కృత్రిమపు
పద్ధతి నామెను సేద దేర్చుడున్.
లేచి రత్నవర్మ మొగంబుఁ జూచి పలికె
నాథ నను డించిపోవుట న్యాయ మగునె?
నిన్ను విడనాడి నేనెట్లు నిలువనేర్తు
కాదనక తోడుకొని పొమ్ము కరుణఁ జేసి.
అనవుడు రత్నవర్మ హృద
యంబునఁ గొండొకసేపు యోచనన్
బొనరిచి కామినిన్ దివిచి
బుజ్జవ మొప్పగ నోలతాంగి! యిం
తన మది చింతనొందఁజనునా?

యిపు డిచ్చట నున్నయట్టులే
పనివిని వచ్చువాఁడ సెలవా!
యన నందులకుల్కు నొందుచున్.

జనపతిని వదలి చని "యో
యనఘా! నినువీడి యుండ నంటిని; నాయీ
మనవిని గైకొనవైతివి;
చనిమెద నాపోలినట్టి చక్కి" కటంచున్.

కుటిలజాతి యంత పటురయంబునఁ జెంతఁ
గ్రాలునూతిలోన గూలుటయును
మనుజపతియు నట్టె మ్రానుపా టొందుచుఁ
బిదపఁ దెలివిఁ గాంచి పేరెలుఁగున.

చెలియను దీసి తెచ్చుటకు
సేవకకోటిని బిల్వ నంతకే
మెలఁతుక యాజ్ఞచేఁ గడున
మీపతలంబున డాఁగియున్న వా
రలు తగుసాధనంబుల బిరాన
నృపాలునిచెంత కేగి యా
నెలఁతుక దీయఁగా నదియు
నిక్కము చచ్చినదానికై వడిన్.

మెడలు వ్రేలవైచి మిడిగ్రుడ్డులను బెట్టి
క్షితితలేశుఁ గొంత సేపుదాఁక
నడలఁజేసి పిదప నెడమూల్గుతో నీ
వెలఁది యంత కన్ను విచ్చి చూచె

ఆరీతి బ్రదుకుఁ గాంచిన
నారిం గనులారఁ గాంచి నరపాలుండున్
బాఱఁగవైచినలిబ్బిన్
దాయనఁ గనుఁగొన్న నరువిధంబునఁ బ్రీతిన్.

మెల్లన లేవనెత్తి నను
మేనును దట్టుచు సేద దేర్చి యో
పల్లవపాణి! యింతతలఁపన్
జననే? యిటుముద్దరాలవై,
యెల్లియొ నేఁడో క్రమ్మఱఁగ
నేఁ జనుదెంతు నటన్న నింతకే
చెల్ల! వియోగవేదనలచే
ననుపుల్కడ తేర్పఁ జూచితే!

నాయదృష్టవశంబున నాతిమిన్న!
చచ్చి క్రమ్మఱ బ్రదికితి చాలుఁజాలుఁ
దగులునది తప్పునదికూడఁ దలఁపనేర
వేమియుఁదును నీతెలి వేమి యయ్యొ?

అనుచు ననేకభంగులఁ
దడంగనఁగూర్చి సమాశ్వసించి న
మ్మనమున నౌర! యీచెలువ
మన్మథబాణహతిం గలంగుచున్
నను నెడఁబాసి యుండినక్షణం
బొకయేఁడుగఁ జూచుచుండు నం

చును మది నమ్మియుండె నల
సుందరి నిష్కపటానురాగగాఁ.
అనురాగాంబుధి పెల్లున న్మనీఁగి
మోహాంధుండు వారాంగనఁ
గని, యెన్నండును నిట్టిసాహసములన్
గావింప నేనంచు న
చ్చిన ప్రేమంబున బాస చేయుమనినఁ
జిన్నారిలేనవ్వు మో
మునకుఁ వింత మెఱుంగువెట్టఁ
బడఁపుంబూఁబోడి తా నిట్లనుఁ.
సరసాగ్రేసరచక్రవర్తి వగు నీ
సౌందర్య మూహింప సుం
దరనారీజన చిత్తవిత్తహరణో
ద్యత్ప్రౌఢ మౌఁగాన సు
స్థిరబుద్ధిఁ నినుఁ బాయ నెన్నఁడనుచుఁ
జేఁజేయిడన్ జాలుదే
నిరహిఁ స్వాంతము చిక్కఁబట్టుగొనఁగా
నేనోపుదున్ నావుడుఁ.
ఆనెలఁత పలుకు లమృతపు
సోనలవలె వీనుదోయి సోఁగయింపఁగ బ్ర
హ్మానందంబునఁ బొంగుచు
నా నట్టులె కాక చెలువయాన యిడుమనఁ.

సఖుఁడ! మున్ను నీవె శపథంబు సేయఁగా
వలయు ననుచుఁ బలుకు వారకాంత;
యీప్రశంస మున్న యేఁ దెచ్చితిని గాన
రమణి నీవె యనును రత్నవర్మ.
పొలయలుక నిష్ఠురంబుల
పలుకుల నోనాడుటలను బట్టింపులచే
బలవంతముగాఁ దుద కా
నెలఁతయు రమణుండు నొక్క నియమముగాఁగన్.
ఇరువు రొక్కసారి యేకవాక్యంబుగా
శపథ మాచరింప సమ్మతించి
యొకరి శిరమునందు నొక్కరిహస్తంబు
నొకరిచేతిలో నొకరిచేయి.
చేరిచికొని యామాయల
మారియయిన రూపణిక యమాయికసరసుం
డారత్నవర్మయును నీ
తీరున శపథంబు తెఱఁగుఁ దెలిపిరొక మొగిన్.
"మేనులు వేఱై యుండినఁ
బ్రాణం బొక్కటిగ తలఁపుఁబడి యొక్కటిగా
నీనాభేదముఁబోనిడి
యానందించుదముగాక" యని యొండొరువుల్.
ప్రతిన సేయ, రత్నవర్మ చిక్కెనుగదా
యనెడు సంతసంబు నాటవెలఁది

కానెలంతదక్కెనను ప్రమోదము రత్న
వర్మ కొక్కమాటె ప్రభవ మయ్యె.
అదిమొద లాగయాళి నగ
లంచును, నాణెము లంచుఁ, గట్టఁగాఁ
బెదపెదచీరలంచు, నిరు
పేదల కిచ్చుట కంచు నిండుప
ర్వదినము లంచు వెచ్చములు
వాడితి నంచు నెపంబు వెట్టి నే
ర్పొదవ ధనంబు దోఁచుకొను
చుండెను వెంగలిఁ జేసి యాతనిన్.

శ్రావణశుక్రవారము వచ్చెఁ గట్టుకా
నులపేరుపైఁ బూజ సలుపవలయు
నవరాత్రములు వచ్చె నగరాజపుత్రిక
నిలిపి యుత్సవములు నెరపవలయుఁ
గార్తికసవసుధాకరవార మిది పేద
దంపతులనుగూర్చి తనుపవలయు
మకరసంక్రాంతిని మన కున్నయంతలో
వేదసాధల కిచ్చి యేదవలయు
ననుచు నెఱజాణతనమున నతనిఁ జెంత
ప్రతిదినంబును నిదియొక పర్వమనుచుఁ
గల్పనముచేసి ముదుసలి గడసకత్తె
దినము నూఱువరాలైనఁ గొనుచునుండు

ఆమూఢుండు ధనాంగనావశతనుండై
యేమి వాంఛించినన్
బ్రేమం దెచ్చి యొసంగుఁగాని
తుదకీ విత్తంబు పోవంగఁ దా
నేమియ్యంగల నప్పు డెట్టు లని
యూహింపం డొకింతైననా
హా! మోహాంధుఁడు జ్ఞానశూన్యుఁడయి
యుక్తాయుక్తముల్ గాంచునే!
ఇటు లావారవధూలలామగృహమం
దెల్లప్పుడున్ నిల్చి దు
ర్వ్యటుఁడై విత్తము దోఁచియీయఁగ
నయారే! దుష్టసంచారలం
పటుఁడౌ నీతనిచేత రాజ్యరమ
క్షిప్రంబె నశించుంగదా
యెటులంచున్ దలపోసి మంత్రు లొక్కటై
యేకాంతమార్గంబునన్.
సుహృదులార! మనము చూచుచు నూరక
యుంటిమేని యాతఁ డొక్కనెలకె
రాజ్యమెల్ల వారరమణికిఁ జేరుచు
నామహానుభావుఁ డాడినట్లు.
దానితోడిద లోకంబు దానిపలుకె
శాసనముగాఁగ గ్రహియించి సాధ్వియైన

కులసతి నెడల్చినట్టి యా కుటిలమతికి
నతని కిరాజ్య మొకలెక్క యగునె చెపుడ?
కావున నాతఁ డెట్టి యధి
కారము గల్గిన నేమి నేయు? “నీ
వీవిధి నీచవృత్తిఁ దగవేది
చరించెదు నంతకాలముగా
భూవరుఁడయ్యెదే వెడలి పొ”
మ్మనుచుం దెరలించి సాధుస
ద్భావము తోడుతే న్మన మె
పాలన సేయఁదగుగా గ్రమంబునన్.
మాయావతు లగువారా
జ్జాయతలోచనలు ధనము నాసించిన పా
శే యగుట నప్పు డాతని
రోయుదు రొకయించుకైన రోయిడ లేమిన్.
తనయంతఁ దా వివేకం
బును బొందుచు నప్పుడతఁడు మునుకొని వారాం
గన దుశ్చారిత్రంబును
మననము సేయుటనె బుద్ధిమంతుం డగుతగ.
అప్పు డతనిరాజ్య మాతని కొప్పించి
బరువు దింపికొనఁగ వచ్చు మనకు
నమలసచ్చరిత్ర ననురూప ననురూప
యనుచు నప్పు డేలి కొనఁగలండు.

కాకున్న నింతలోపల
నాకుటిలాలకల కృత్రిమాపాంగంబుల్
తాఁకి మతిచెడినయాతేం
డూకొనునే మనము పలుకు నుచితవచనముల్?
అని యాతం డరుదేరకుండఁగనె కో
శాధ్యక్షునిం బిల్చి యా
తనికిం గట్టడఁజేసి యున్నతజీ సి
త్యం బిచ్చువిత్తంబులఁ
గొనిపోవచ్చిన రత్నవర్మఁ గని యా
కోశాధినాథుండు లే
దనినఁ గోపముతో నదల్చుచును “నా
రా! యింతదుర్గర్వమే!
భయములేక యిట్లు పలుకునీసాహస
మెవనివలనఁ గలిగె నెఱుఁగఁజెప్పు”
మనుచు ధిక్కరించి చని క్రోధమూర్తియై
కొలువుకూటమునను గలయఁజూచి.
తనమంత్రివరులపైఁ గనలి “స్వామిద్రోహ
చింతాపరాయణ చిత్తులార!
మిము నమ్మి యెల్లరాజ్యము నొప్పగించిన
ననుఁ ద్రోసిరాజు, చేయున తలంచి
కృత్రిమం బూనితిరే” యని యదలింప
వారు “నోవిటరాజ! భాగ్యమనుచుఁ

దలఁపవుగా యిట్లు తగవేది చరియించు
నెడ నిచ్ఛమై నిన్ను విడుచు బెల్ల
నవనినాయకుఁ డవినీతుఁడై నఁ బ్రజలు
విశ్వసించెద రే? యిట్టి వెఱ్ఱి యేల?
అయ్యొ! చేఁజేతఁ దెచ్చికొన్నట్టియెడరు
ననుభవింపక తప్పునే మనుజులకును.

నానృడు రత్నవర్మ వద
నంబున విన్నదనంబు దోఁపఁగాఁ
జేవఁ దొలంగి వారియెడఁ
జేయున దెద్దియు లేక దీనతఁ
దైవముచేఁత కెంతయును
దా దురపిల్లుచు వారి పీడి వే
శ్యావసథంబె దిక్కుఁగ మ
హార్తిని బోవుచు నెమ్మనంబునన్.

ఇచ్చకు వచ్చినట్టులు వ్య
యింపక యుండఁగ మంత్రు లెల్ల న
న్నిచ్చటినుండి త్రోసి తమ
యిచ్చ తెఱంగున రాజ్య మేలుచున్
గ్రచ్చర నాకుఁగల్గు నధి
కారము లన్నియుఁ దీసివైచి రే
నచ్చటికేగి యెట్లుముద
మందఁగ నేర్తు? విచారమయ్యెడిన్.

రూపణిక కోర దెన్నఁడు రూకరైన
బోసిపులిలాగు ధనరూప బైసి మాలి
చీటికిని మాటికిని నన్నుఁ జేర వచ్చి
యాపనియు నీపనియుఁ జెప్పి యనుదినంబుఁ
డబ్బుదస్కంబు లాగి తబ్బిబ్బు సేయుఁ
గలిగినన్నాళు లావృద్ధకామినికిని
దోఁచి పెట్టితి నిపుడేమి తోఁచకుండె
హీనమగుఁగాదె ద్రవ్యంబు లేనిబ్రతుకు!
ఎట్టులైన ధనము నీయక తక్కిన
ముసలిముండ లోన విసుఁగుకొనును
దానిఁ దృప్తిపఱుప నేని మున్నింటి నా
గొప్పతనమునకును గొఱఁతగాదె?
ఎన్నివిధంబులఁ జూచిన
సొన్నాటంకములు లేనిచో రూపణికన్
గన్నెత్తి చూడఁ జాలను
మున్నిచ్చెడివాఁడ నరక బోవఁగఁగల నే!
అని యీగతి మొగమోటం
బున మనుజాధిపుఁడు దాని పొత్తున కెట్లో
చనుఁగాని మనస్తృప్తిగ
మునువలె మాట్లాడఁబోఁడు ముగ్ధుఁడువోలెన్.
రత్నవర్మవిత్తంబుతో రాజ్యమెల్లఁ
బరులపా లయ్యెనంచు రూపణిక యెఱిఁగి

యదిమొదలు వాని మునుపటి యట్లు గనక
మెట్టులైనను నిలు వెళ్ళఁ గొట్ట నెంచి.
ఇంతకుమున్న యెండజీనొ
యిట్టులె చేరఁగఁదీసి నేర్పునన్
దొంతరగా సమస్తమును
దోఁచి విరాగులఁ జేసి నిర్దయ
స్వాంతముతోడ నిల్వెడల
నంపినగద్దరితల్లి గాంచి నీ
వం తిఁకసాగనిమ్ము మన
వాడపడంతులు మెచ్చున ట్లనన్.
రత్నవర్మకు గుండెలో రాయి వోలి
హైసరే యని చంకలు వేసికొనుచు
విటజనవ్రాతజీమూత చటులవాత
వికృతగుణజాత యరుదెంచె వేశ్యమాత.
వచ్చి, వాడసతులపై నెపంబిడి వీని
నిచ్చవచ్చినట్టు లెల్లనాడి
వెలువరింతు ననుచుఁ దలపోసి యాతఁ
డాయనేగి యనియెఁ దక్కులాడి.
ఏమిజామాత! మనవాడ భామ లెల్లఁ
బండుగులు పబ్బములు జేయుచుండి రిపుడు
గ్రామదేవత జాతర గాన నేఁడు
మనము నూరక యుండుట మంచి దగునె?

నాన బూని తేమి నావెండికొండ! నన్
గాంచవేమి నాదు కాంచనంబ!
పలుకవేమినాదు బంగారు చిల్క! నీ
మాద్రి నేడు వింతమాద్రి యయ్యెం
బిసిబిసివల్కులె కానీ
పిసిడితనం బబ్బె నీకుఁ బెటిచోటుల నీ
గుసగుస లేనెఱేఁగిలి నీ
ముసిముసినగ వేల నన్ను మోసము నేఁగన్.
మాట లిచట ధనపు మూట లాతావున
బొందె యిచట మనసు పొందు లచట
నెఱుఁగవచ్చెఁ గల్ల లెల్లను నాకడ
డాఁపనేల? వెట్టి భూపతనయ!
అనఁగ విన్నఁబోయి యగు నగు నరిపోయె
నెచట నేర్చికొంటి విట్టిమాట
లకట! రత్నవర్మ యారూపణికఁ గాక
యన్యఁ గోరునట్టి యధముఁ డగునె?
రూపణికయె నాదు ప్రోపును ప్రాపును
రూపణికయె నాదు రూపు చూపు
కల్లబొల్లిమాట లల్లి యీరీతిని
నన్నుఁ దూలనాడ న్యాయమె? యిసం.
"టక్కుపిక్కుఁ జేసి డబ్బు డబ్బెద వేల?
యిట్టిబొంకు లెల్ల నేమెఱుఁగమె?

జార! కాసు లిచ్చి యా కురంగాక్షితో
మాట లాడ; మాట మఱచితొక్కొ!
నిన్న మొన్న నెకదా కన్నెరికము చేసి
తా కళావతికి వేయాకలిచ్చి
వెండికోరం గిరవెట్టి దాని మొగాన
నా హేమలతఁ గూడి యాడలేదె!
లడ్డులాడులు బంపి వడ్డివీథిని నున్న
మంజువాణిగృహంబు మఱగలేదె!
పసమించి మేల్ బనారసు చీరలనుబంపి
యల చంద్రరేఖతోఁ గులుకలేదె!
ఈవు చెప్పకయున్నచో నెఱుఁగదాదె!
పిల్లి కనుమూసి పాల్ద్రావు వేళఁ దన్ను
నొరులు గన రనుకొనునఁట! యోావెడంగ!
యేడ నేర్చితి వీబొంకులాడుతనము!
ఇట మఱిగియె కావలె న
క్కటా! యాధన మెల్ల వారకాంతల కిడి మ
మ్మటమట జేయుచు నరచే
నిటువలె మోక్షంబుఁ జూపి తేమని యందున్."
నావుడు దబ్బర లాడఁగ
నోవెలఁదుక లాభమేమి యో! తలపోయన్
నీ విటు మాయావతివై
నా పను టిపు డెఱుఁగవచ్చెనా నెమ్మదికిన్.

నావిని "యోరి! యేమనెదు?
నన్నడకించుట పోయెనే? యిదే
లా వెడపోల్కి? నన్నెకుటి?
లాత్మికఁ జేసితి వళ్కు మాని, నీ
భావము వేఱుచెందెఁ బెఱ
భామలఁ గూడుటఁజేసి, యింక నీ
సేవలె చేయుచుండిన ని
సీ! నగరా నగరాన నల్వురు?
ప్రియ మెడలియున్న నీతోఁ
బ్రియమున రూపసికె నెట్టిపిల్ల యగుటఁ జె
ల్మి యొనర్చుచుండె నకటా!
నయమున నిటు కన్నుఁ గప్పినాఁడవు కాదే.
మనములేదు సరియె ధనమును లేదాయె
నిట్టి నిన్నుఁగూడు టేటినీతి?
ధనము మనములేని దండనకాండ్రతో
మనికి మమ్మువంటి మతముకాదు.
వారకాంతలకును వక్కలు, నాకులు
నైన నీయనట్టి వానిఁ గనము
చిల్లిగవ్వ లేక చెల్లునే సరసంబు?
తేరబాఱుగ! లేచి పోర! వేగ."
ఇటు మటుమాయలాడి తన
యిల్లె సమస్తమటంచు నెంచు నా

ఇటుఁ బటువాక్యశూలముల
వీఱఁడిఁ జేసి కలంప నాత్మను
తక్కటముగ నాతఁడున్ వగపుఁ
గాంచుచు నివ్వెఱఁబొందియక్కటా!
యెటువలె నింక నీజరభి
యింట వసింతు నటంచు నెంచుచున్.
మతిమంతుఁ దూలనాడిన
మతియుతుఁడను నాకు నిట్టి మతకమునఁ బడన్
గతియగుటకంటె వేఱగు
గతి గలదే? యనుచు జరభిఁ గని యిట్లనియెన్.
మాధనమునఁ బెఱిఁగిన నీ
బోధనములు మెచ్చవచ్చె బుద్ధియు వచ్చెన్
మాధనము మరలఁ బొందెను
సాధనములు లేవొ? యనుచుఁ జక్కం బోయెన్.
అతఁ డారీతి వేశ్యాగృహంబు విడిచి
దీనగతి జనులమొగంబు గానలేక
మాపుపడుదాఁక నొకమావి తోపునందుఁ
జేరి తలదాఁచుకొనియుండెఁ జింతగూరి.
జనపతి మావితోపున వి
చారముతోఁ దలదాఁచియుండుట నా
వనపరిపాలువల్ల విని
పౌరపుదైవముచేత కాత్మలో

వసరుచు దీనుఁడైన చెలి
పజ్జకుఁ జీఁకటి నేగి యొక్కచోఁ
బనవుచు నొంటిజాలిఁబడు
వానిని గంటి మనంబు ఝల్లనన్.
క్రమమునఁ జెంత కేగ ననుఁ
గాంచి మనంబునఁ బట్టరాని దుః
ఖమున మొగంబు వాంచి కడుఁ
గారియనొంధఁగ నేను నట్టి దుః
ఖముననె చెప్పఁగానలవి
గాని యవస్థను బొంది యెట్టెటొ
క్రమమున ధైర్యమూని సఖు
కన్నులనీళ్ళుతొలంగఁ జేయుచున్.
"మిత్రమా! దుఃఖమును బొంద మేలె? చెపుమ!
కష్టకాలంబుననె ధైర్య గరిమ వలయు
బేలుదనమూని యిటు జాలి గూలనేల?
క్రమ్మరఁగ మంచిదినములు రాకయున్నె?"
ఇటులన నించుకంత మొగ
మెత్తి కనుంగొని ప్రాణమిత్ర! నీ
వటుహితవాక్యమున్ దెలుప
నయ్యవి వీనులఁ బెట్ట కిట్టిచె
న్నటిగితిఁ బొందు నన్ను విడ
నాయము; మూర్ఖుఁడ నానిమిత్తమె

కటకట! యీవిధానఁ గడ
గండ్లను బొందకు మయ్య్యలేశముఁగా.
అని తెర తెరలుగ వచ్చెడి
ఘనదుఃఖఝరిం జరింపఁ గానక మఱియున్
బనవుచు బేలుందనమునఁ
దన యవివేకమున కెంతొ తల్లడపడియెన్.

వెగచివెగచి తన్ను వెలవెలందుకతల్లి
తూలనాడుటయును దొంగవ్రాలె
దూషణీకయుఁ దాను లోపలనే యుండి
తరలి పైకిరాక తక్కుటయును.
అదిగాఁ గలపరిభవ మంత చెప్పి
మిత్రరత్నంబ! నాఁడు నీ మేలిమాట
చెవుల నిడకుండుటయె యింత చేసె నన్ను
కూళనై యాత్మరాజ్యంబు గోలుపడితి.

నావిని వారకాంతయెడ
నా వెడ సమ్మికమూని యుండుటల్
భూవర! యెంటి నాఁడొ; యది
బుద్ధి గణింపక యిట్టులైతి నా
యావిని జేసినట్టికృత
కావళు లిన్ని యనంగఁ జెల్లునే?
పావనిదైన నీసకియు
పై నెగటొందఁగ మాయఁ జేయదే.

ఎల్లవిధంబుల నీవద
పల్లవములె దిక్కటంచుఁ బలవించుచు నీ
యుల్లంబు నొందఁ గోరిన
సల్లలితగుణానురూప సాధ్వి నకటా.
ఎడఁబాపఁ దలఁచి నీ క
ప్పుడతుక విష మంపె ననుచుఁ బన్నాగం బా
కన్నఁడు వన్ని నీకు నమ్మిక
పొడమించి సతీమతల్లిఁ బురిఁ బాప దొకో!
ఆ కిటుకుఁ దెలియకుంటివి
మోకాలికి బట్టతలకు ముడిపెట్టిన దా
రాకాసి; కోడి యెక్కడ?
పోకనుగబలించు టెడ? బుద్ధిఁ దలఁపుమిా.
అదియునుగాక చిత్ర మొకఁ
డా వెలచేడియయందుఁ గంటి నీ
కది వివరింతు నీ వటు ప్ర
యాణము సేసిననాఁడు లేనిపో
నిదె యనహిష్ణుతఁ దెలిపి
నిక్కము సై పనిదానియట్ల తా
వదరుచు నూతిలోఁ బడె దె
వారవధూటిక నీవు బెగ్గిలన్.
అంతకు మునుపే జలముల
పొంతం గూపమునఁ జిక్కముం గట్టఁగ నా

జంత నియోగించిన దే
శాంతంబున నీకెఱుంగగా రాకుండన్.
అకట! వెలయాంధ్రు కల్ల మోహముల విటుల
కగపడఁగ జేయఁ బన్ను తంత్రాదికంబు
లిన్ని యన్ని యటంచును నెన్నదరమె!
ఫణిపతిని సృజియించిన బ్రహ్మకైన.
కనుఁగొను మాయావతి క
ల్పన మని చిక్కంబుఁజూపి పార్థివునకు దా
నిని దీసినాఁడ నని తె
ల్పిన విని యాశ్చర్య మొంది పృథ్వీశుండున్.
వెలవెలందిమతక మలవియె యెఱుఁగంగ
మతియుతుండ వౌట నతిచతురత
దానిమోన మెల్లఁ దప్పక గ్రహియించి
తనుచు నన్నుఁ గొంత వినుతి చేసి.
ప్రాణమిత్ర! యెన్నఁ డైన నీనిర్భాగ్య
దశను విడిచి నతిని ధరణిసతిని
ముదము మీఱ మరలఁ బొందఁగఁ గంటినే
కలుగు నెట్టు లిట్టి ఖలున కనుచు.
ఉమ్మలము నొందఁ దగురీతి నూఱడించి
తెల్లవాఱకమునుపె విదేశమునకుఁ
బోవుద మటంచు నొకగున్న పొన్నక్రింద
నిద్దఱము నిద్రనొందితి మింతలోన.

కాకులు కూయఁగ మేల్కొని
నాకడ నచ్చెలిని గనక నవయుచు నతఁ డే
శ్రాకి యెటువోయెనో? యని
వ్యాకులతను వానిఁగూర్చి యాయాయెడలన్.
తిరుగుచు వచ్చితి నని భూ
సురతనయుఁడు రత్నవర్మ చొప్పెఱిఁగించెన్
గరుణామయ! యాకథ నే
నరుదారఁగ విన్నదాన నానమయమునన్.
ఆరత్నవర్మ యనురూ
పారమణియుఁ దన్నుఁగోరి పనవుచునుండన్
వారాంగనతోఁ బోవఁడె
యేరికి మనస్స్వప్రధాన మెంచికొనంగన్.

*      *

అగ్రోత్తరభాగము:
అకట! కరుణలేక యాకథ నీకథఁ
జాటి లేనిపోని మాటలాడి
దీనురాలి నన్ను నూనశరార్తినిఁ
గూలద్రోయఁ జూడకుము మహాత్మ!
కోరికఁ దీర్పవేని యివి
గోఁ! జనన్నవి మేనిప్రాణముల్
మారశరాహతిన్ గెడలి;
మాటలు వేయు నిఁ కేల? పుణ్యముల్

గూరిచి యాదరించుటయు
క్రూరతఁ బాపమతిన్ ద్యజించుటో
యూరయు మింక; నీకొఱకుఁ
బ్రాణము వాయుటకంటె నున్న దే.
అని తెల్పన్ బురుషుండు నిల్చినను నీ
రై నట్లుగా నుండి య
ల్లన నొక్కించుకయంతలోఁ దెలిసి వె
ల్లంబోయి నిట్టూర్పు లొ
య్యన శోణాధరబింబసంపదలఁ ఱు
యంజేయ లోలోపలం
దనకుం దోఁచువికారముల్ మొగమునన్
గన్పట్ట విభ్రాంతి చేన్.
తనయునికికి నొకలాగై
కనకాంగికి నిట్టికోర్కి గారాదని లో
ననుకంప గదుర నయ్యో!
వనజానన! తత్తరంబు పలవ దుడుగుమీ.
ఏకపత్నీవ్రతుండ నే నెట్టులింక
నీమనసుదీర్పనేర్తును నెలఁతమిన్న!
కాక యనురూపమైనదా కాంత యుండె
ప్రక్కయింటనె శయ్యపైఁ బండియుండె.
నాతి! నీప్రాణసంరక్షణంబు కొఱకు
వ్రతము చెడఁజూచినను బ్రాణపతి కొకింత

తెలియకుండదు దానన తెగును సాధ్వి
యెట్టులైనను స్త్రీహత్యయే ఘటిల్లు.
అనుకూలదాంపత్యమునకు భంగము తెచ్చి
పాయంగరాని పాపము గడించి
పరసతీధర్మంబు పరగడఁ బడవైచి
జారిణియనుపెద్ద దూరు వడసి
నలుగురిలోవల నగుబాటులను జెంది
తలయెత్తి తిరుగంగఁ దలఁకుచుండి
చెలువుతున్నతికిని దలవంపు ఘటియించి
కొలమువారలలోనఁ గొఱతఁ గాంచి
ఐహికాముష్మికసుఖంబు లవులఁ ద్రోసి
తిరుగమనసయ్యోనే! వెఱ్ఱితెఱవ నీకు!
కుడిచి కూర్చుండి యిటువంటి గొడవ తెచ్చి
కొని యధోగతిపాలు గాఁగోరె దేల?
అన విని యీతని కొంకయుం
గన గల దని వినుట లేదు కడు చతురుండై
నను జంకించుచు నున్నాఁ
డని తలఁచి మొఱుంగుబోఁడి యాతని కనియెన్.
చాలునుజాలు నిట్టియొక
సక్కెపు నీతుల కేమిగాని, యి
ల్లా లోకయింటిలోన; నర
సాగ్రణి నీవొకయింటిలోననా!

మే లెఱుఁగంగవచ్చు; తల
మీఁదికె వచ్చెను నీకుయుక్తు లా
బాలిక యేది చూపుము? సె
బాసు! నిజంబుగ సందెహముండెనో?
నావుడు నద్దిరయ్య! జత
నంబిది మంచిదె; తాఁ దనంతనే
యీవిధిఁ దెచ్చికొన్నయది
యే నటుచేసిన దీనిబాధయే.
పోవు నటంచు నింటితేలు
పుల్ దెమలించినయంతఁగోనె ని
ద్రావృత యొక్కచాన కన
నై చెలియాసల నమ్ము సేయుచున్.
దోరము తెఱచిన చప్పుడు
తోరంబై నిదుర తెలిసి తోడన యానా
రీరత్నం బడలున నా
పూరుషుఁ డున్నెడకు వచ్చి పోడిమి గనుచున్.
పంకజాస్యునియాతివ శౌఱమనఁగ
నుజ్జ్వలాకారయైయున్న యువతి నొకత
నడిమి రేయి నాపూరుషు కడన గాంచి
సంభ్రమాశ్చర్యచిత్తయై చాన నిలువ.
కోపమొ భయమో యీర్ష్యయొ
తోపంగాఁబోలుఁ బ్రథమతో యజముఖి యా

టోపమున మేను వడఁకఁగఁ
జూపుల నిప్పులను జల్లుచుఁ మరలి చనెఁ.
"పరచిత్త విత్త హరణము
సొరిదిం జేయుటకు జారచోరులు వేఁ
తరులై తిరిగెద రాయెడ
నొరులు గనినఁ దలఁగి పోవు టుచితంబె కదా!
సుందరుఁడఁట! యేకాంతపు
మందిరమఁట! వానిఁ గోరి మగనా లఁట! తా
సందుఁ గని వచ్చెనఁట! యీ
యంద మెరులు చూచుటయు రసాభాసమె కా!
వనిత యెవ్వనిమదిగోరి వచ్చినదియొ
యతనియిల్లాలె యెదుటఁ బ్రత్యక్షమైన
భయము తలముంపదో! జారభామినులకు
సాహసముకంటె నధికంబు సంశయంబె.
అతనియిల్లాలు తనకంటె నందమైన
దనెడు నీసు జనించిన దండుమేని
దాని మించిన తను వానిపైని గలిగి
యుండఁబోనేల! కారణం బుండవలయు.
ఎంత వేస మూని యిలు సొచ్చె! నింతలోఁ
జసిరెను మనసు చివుకు మనఁగఁబోలు!
నెన్న నెంతో తమక మున్నది! మరల నే
వరుసనైన వచ్చి పడకయున్నె?"

అదియును నిదియును గనుఁగొని
మదవతి మదిలోన వింత మాదిరి యనుచున్
వదనమున వెఱఁగుతోఁపఁగ
నిది యేమని చెంతనున్న హితు నడుగుటయున్

చెలువ! యేమి చెప్ప చిత్రంబుగానుండె
నీవు నిదుర గూర నీ నెలంత
భయము పడినదానివలె వచ్చి యిలు సొచ్చి
యెంత చేసిపోయె నెఱుఁగవుగద!

అని యాటక్కరికత్తియ
చను దెంచిన దాదిగాఁగ జనిసది తుదిగాఁ
దనకడ జరిగినదంతయుఁ
గొనకొని వినిపించెఁ బూస గ్రుచ్చినరీతిన్.

వనిత యప్పుడె నిద్ర మేల్కనుట స్వప్న
మేమియై, దీనఁ దార్కాణ మేమయినదొ?
సుడియువడగాలితాఁకునఁ దొడిమవీడి
రాలు కుసుమంబువలె నేలఁ గూలబడియె.

పతి పరకాంతలతో సం
గతిఁ జేసిననైన నతులుగసలను; తనుదాఁ
బతిఁ జేరిన పెరచెలి చే
ష్టితముల వినినంత మూర్ఛ జెందె నిదేమో,

వెలవెలంబోయి యతఁ డంత దెలుపుచుండ
వినుచుచుండెడి దశ్రువుల్ వినుచు వినుచు

ఆ చరిత్రంబునందు నే యంశమైన
నామెహృదయంబునకు శూలమయ్యె నేమొ?
ఇసుకబోడిహృదయ మెంతటిమృదులమో?
తేటతెల్లముగను దెలిసిపోయె
కష్టగాథ నడువఁగా నింతవాటిల్లెఁ
జివురుటాకు డప్పు చేయఁ దగునె?
కనులయెదుటఁ బడియెఁ గాన మూర్ఛిల్లిన
దనుచు నిశ్చయముగ నాడవచ్చు
చేష్టఁబట్టి యూహ చేయవచ్చును గాని
యెవరిమనసుఁ దెలియ నెవరితరము?
అంతట బూరుషుండును ద
దంగనపాటున కార్తినొందుచుఁ
"జింత యిటేల రావలయుఁ?
జల్లఁగఁ బ్రొద్దులు పుచ్చుచున్న మా
చెంతకు వచ్చి యిట్లడలఁ
జేయఁగ నేల? సమస్తమేటి కీ
కాంతకెఱుంగఁ జెప్పితిస?
కార్యము దప్పెనిఁకేమి సేయుదుఁ."
అనుచుఁ దత్తరపాటున సతివఁ జేరి
వలయు నుపచారములఁ జేయఁ దెలివిఁ గాంచి
నసిచెడిన మేనితో* బాష్పజలము లొలుకు
కన్నుఁగవతోడ నెచ్చెలిఁ గౌఁగిలించి.

అనయం బాత్రిని నేము చెప్పతఱి ను
గ్రాకారుఁ డుద్వృత్తసూ
జనితాంచద్ఘన తేజుఁ డొక్కఁడు లస
చ్ఛ్రుదాయుధోపేతుఁడై
తనవెంటన్ జనుదెంచు పూరుషుని న
త్యంతంబు దూషించుచున్
గనులన్ నిప్పులు రాలఁ దత్ప్రఘుతరా
గారంబు సొత్తెంచుచున్.
కనుఁగొంటిమ్మా యనుకూలదంపతుల మూ
ర్ఖా! మున్ను నాతోడఁ బా
వనరూపాన్వయసచ్చరిత్రముల నే
పద్మాక్షినిం బోలునం
గన లీభూతలమందు లేరనుచుఁ బొం
కన్ గొంకవో యట్టిపా
వనరూపాన్వయ సచ్చరిత్రగల దీ
పద్మాక్షియే కాదొకో?
మగనితోఁ గుల్కుచుండె నీమగువఁ జూడు
మది పతివ్రతాధర్మంబె యగును గాదె!
తిరిగినదిగాదు నీనాల్క తెలివతెరగు
వర్ణనము సేయుటకు నలవాటు పడుము.
ఎంతసుబుద్ధివి! నీమతి
మంతయున కెక్కెఁగద! దీని మహిమలు దెలుపన్.

జంతాను రూపముగ నను
మంతనె భారతిగ నిన్ను నభివర్ణింతుఁగా.
అన నొకరి మొగము నొక్కరు
గని వెలవెలపోవుచుండఁగా గృహయజమా
నుని జేరి చురుకుచూపుల
మొనయించుచుఁ బలికె క్రోధమూర్తియపోలెన్.
ఔర! యిందాఁక నొక్క కల్యాణిచెంత
నిచ్చినట్టి యుపన్యాస మెఱుఁగవచ్చె
పగలు సన్యాసియును రాత్రి మగఁడుఁగాఁగ
మెలఁగు నన్నట్టులుండె నీ తులువతనము.
తానువలచినదిగదారంభ! యనురూప,
సాధ్వి, సచ్చరిత్ర, సాధుశీల,
చెలువమీఁది వలపు తల కెక్కియున్ననీ
వంటివాని కట్లు పలుకఁ దగదె?
కోరివచ్చుకాంత స్వైరిణి, నీకడ
నలరుకాంత సాధ్వి, యంటి భళిర!
కనుఁగొనంగ నెంచ తనకంపు తన కింపు
గాకయున్న బ్రతుకఁగాఁ దరంబె?
నిను మదిఁ గోరి బాళి మెయి
నిల్వఁగలేక మనోహరాంగ! న
న్నెనయు మటన్న కాంత నెటు
లేనియుఁ ద్రోపుడువెట్ట నెంచి దేఁ

వనితపతివ్రతావిమల
వర్తనమున్ బ్రకటించి మాటలం
దనుపఁగఁజూచి తా సుగుణ
ధన్య యిదే యగుఁ గాదె? దుర్మతిం.
అనుచుం గోపము దూపముంగొనినయ
ట్లావీరుఁ డుద్యద్ఘనా
ఘనగర్జారవభీకరం బయినహూం
కారంబునన్ శత్రుమ
ర్దనదుర్దాంతకరాళదారుణపటు
ప్రాఘిష్ఠకౌక్షేయకా
తనుశస్త్రం బగుహస్త మెత్తి ప్రళయో
ద్యత్కాలకాలాకృతిన్.
ఓసి దురాత్మురాల! కన
నొల్లను దుర్గుణగణ్యవై సము
ల్లాసముతోడ దుర్నయక
ళాకుశలుం డగు నీనిచెంగటన్
భాసిలుచున్న; దారుణకృ
పాణహతిం దలద్రుంతు నేనియం
బూసినకత్తిఁబోలు నిను
బోవిడనంచు ఖరాసి నాసతిన్
హొడువఁగ నేగునాతనికిఁ
బాదుషుఁ డడ్డము వచ్చి కత్తి బ

ల్విడఁగొని యేల లేఁతపసి?
వీరవరుండవుగావె! సాధ్విని
వ్యధువునఁ జేయఁ జేసికొన
వచ్చునె? నాయనురూప చంపఁగాఁ
బడునొకో నాదుకంఠమునఁ
బ్రాణము లుండినయంతవట్టునన్.
వలదు వలదు రత్నవర్మమహీశ! నీ
సాధ్వి నిట్టులేల చంపఁదలతు
నీవె పెండ్లియాడి నావె? లోకమున ని
ట్లున్నవారె చేసి కొన్నవారు?
నావుడు నెట్టెటు? నీవే
గావా యీ చెడిపె కింకఁ గలరే నాథుల్
భావంబుదనుపువార ల
హా! వారాంగనని మేల్ బళా! యనిపించెన్.
అనిన ననురూప గుండె ఝల్లని కలంగి
హా! మనోనాథ! పూర్వకర్మానుభవము
చెడునె? నీ చేయునది యొల్లఁ జేయుమయ్య!
ఫల మిఁకను నింతకంటెను గలదె నాకు?
ఓపఁజాల నయ్యయో! యిట్టిదుఃఖంబు;
తడవుసేయనేల దయదలిర్చ
పాపి నన్నుఁ జంపుపనికిఁగా భారతీ!
కత్తి నిమ్ము ప్రాణకాంతునకును.

అని యెనలేని శోకవివ
శాత్మకయై ప్రకటింప నద్దిరా!
కనుఁగొన వింతవింత లగు
కల్పన లన్నియుఁదోఁచుచుండె నీ
తని నిటు భారతీ! యనుచుఁ
దన్వి వచించుచున్న దేమి? గో
పనమునన్న యీమగది
భారతి గాదుగదా! తలంపఁగన్.

అనుచు రత్నవర్మ యాశ్చర్యమగ్నుఁడై
యితఁడు భారతియఁటె యీమె దీని
భార్యయట్టె! యెట్టి సాగెను? మిత్రమా!
కంటె! వింతనాటకంబు దీని.

గోడవెట్టినట్టు లాఁడుది బొంకిన
పురుషుఁడైనఁ దడకఁ బూసినట్టు
లనుట నిక్కమయ్యె నరయుమీ మతిమంత!
మంటిజంత యెంత బొంకుబొంకె?

తానట్లు ప్రేలినంతనె
నే నాలోచింపకుందునే! భారతియే
తానై యుండిన నీవెడ
మానిసివన తెలియఁబడుదువా! నిముసమునన్.

అని ఖడ్గం బువ్వెత్తుఁగఁ
గొనుటయు వెలవెల్లనగుచు క్షోణీశ్వర! నీ

ననుమానింపకు మీారా
వనిమాటకు వేఱుగలదె? భారతిని సుమీా.
అని పురుషరూప మెడలిచి
తనసత్యంబై నరూపు దాలిచి నిలువఁగా
గని సంతసమున నేమీా
వనజాననలార! యెంత వారలు మీారల్
భాగ్యమయ్యెఁ గోపభావంబునను జేసి
యొండురీతిఁ జేయ కుండఁ దప్పె
ననుచుఁ బ్రియముతోడ ననురూపఁ గౌఁగిటఁ
జేర్చి పలికె నగవు గూర్చునటులు.
పడఁతి! మంచిమగని గడియించుకొంటివి
పాపబుద్ధి నిన్నుఁ బరిభవింపఁ
దలఁపు గొన్న నన్ను దండింపుమీా! శిక్షఁ
బడఁడె నేరపెట్టఁ బడినవాఁడు?
నావిని మోము వాంచి సుజ
నస్తవనీయచరిత్ర యైన య
ప్పావని ప్రాణనాయకుని
ప్రాంతమునం బ్రథమోపగూహ
వ్యావృత యైనసిగ్గుఁ దడఁ
బాటొనరింప వచింపరాని మో
హావిలచిత్త యై నిలిచె
నత్తరిఁ జిత్తరుబొమ్మయో యనన్.

రత్నవర్త్రియుఁ దనసతీ రత్న విమల
గాత్రసంస్పర్శనంబునఁ జిత్రగతిని
మాఱెఁ దొంటిగతి నెఱుంగ నేరకుండఁ
గ్రొత్తవలచెల్మి యాలిఁ గూర్చు టరుదె?
“అకట! నిర్దయుండ నై మటుమాయల
మారినైనయట్టి వారకాంత
పలుకుబడిని జేసి యిలువెళ్ళఁ గొట్టితి
నేను సచ్చరిత్ర లైన మిమ్ము.
అబలలార! మీర లయ్యనంతరమునఁ
గూళనై ననన్నుఁ గూర్చి యడలి
ఎచ్చటెచటి కేగి రెట్లు మెలంగితి
రెట్లు చేరినార లిప్పురంబు?
భారతి మేలు! నీదు సహా
వాసము చేనసురూప యిమ్మెయిం
గ్రూరతఁ బ్రాణనాయకుఁడు
కోపముతో నెడలింప దిక్కులే
కారట మొందుచుండియును
బ్రాణముతో నిలువంగ నోపె చే
కూరెను శుభంబు సంపదల
కుం గుదురైతిమి నీకృపాప్తి చేన్.

పూర్వోత్తరభాగము:

అనిన భారతి వల్కు నవనీశ! నన్నింత
బాగడంగ వలయునే? పూర్వకర్మ
మనుభవింపక తప్పు నయ్యా! వెంజీకటి
కొన్నాళ్ళు వెన్నెల కొన్నినాళ్ళు
గాదె? నీవప్పు డీ కాంత నిర్వాదలింప
నకట! యనియెడు దిక్కు లేక
విలపింపఁ దోడరు
నుమ్మలిక డగ్గరి సుబు
ద్ధియు నేను నొక్కింత దిగులు దీర్చి
అక్కచెల్లెండ్రవలె పుట్టి నంతనుండి
పెరిగినారము గాన నీ తెరవయెడరు
మువ్వురము బంచికొని దైవమునకుఁ గుంది
కుంది యెందేని తలఁదాఁచికొనఁ దలంచి.
ఈవిధమున దుఃఖదేవత మూర్తిమత్త్ర
యంబు దాల్చెనేమొ యనఁగఁ జూచు
వారిగుండె లెల్ల నీరుగాఁ జేయుచు
దారయొద్దఁబల్లెటూరుఁ జేరి.
అందొక సాధుశీలయగు
నవ్వ గృహంబున నిల్చియుండి చ
క్కందనమందు మిన్నలగు

కాంతల స్థాపద కెంపుఁ జెందునం
చుం దలఁపోసి యూ[illegible]
చొప్పాలు సూర్ప[illegible] నీమె దా
నందుల కోపసన్న వల
దట్టులె యుండు మటంచు నేనొగిఁగా.
ఆ సుబుద్ధితోడ ననుసూప నట డించి
యచటి కనతిదూరమైన దార
యనెడుపురికిఁ జేరి యటఁ బురుషోచిత
ములగు వస్త్రములను విలిచి యంత.
కనుమూసినఁ దెరచిన నొక
యనువుగఁ జీఁకటులుఁగ్రమ్మ యాకసము ఘనా
ఘనసంయుక్తమై యారా
త్రిన చను దెంచుటకు నా మది న్వారపింపగా.
అట సుబుద్ధి యున్న యది భయమేమి లే
పరుగవచ్చు నని రహస్యదేశ
మందుఁ జేరి పూరుషాకారము ధరించి
యెలమి నొక్కవిప్రు నింటి కరిగి.
అట నారాత్రి పరుంటిఁ గాని కను మో
డ్పైనం గనన్ లేద యు
చ్చట నాయింటి గృహస్థురాలికిఁ దనూ
జాతుండు దుష్కర్ములం
పటుఁడై దుఃఖము వెంప నావెలఁది భా

సంబాదుఁ జింతించుచో
నా [illegible] వృద్ధయొక టు తేర్చ నటిపో
యె: వింటచే న కునన్.
వేగుటకు మున్నుగా లేచి విప్రకాంత
కెఱుఁగఁ జెప్పి పల్లియనున్న యింటి కరిగి
దీనయైయున్న యమరూప తెరగదెల్లఁ
గాంచి నాకలరూపెఱింగించి చూపం
హా! యనిమూర్ఛవోవమది
నచ్చెరువున్ భయమున్ విచారమున్
వేయువిధంబులొంది చెయి
వెట్టికలంచినయట్లుచేయన
య్యో! యిదియేమి పాపమని
యూర్చుచు నెట్టెటొ తేర్చిలేవఁగా
సాయముఁజేసి వెన్జరచి
సాధ్వి సుబుద్ధి యేటేగెనో యనఁ.
గుండె లడల నెలుఁగు కుత్తుకఁ దనరంగ
భ్రాంతి! యటంచుఁ జేరఁదీసి
కటకటా! సుబుద్ధిఁ గాంతుమే మనము జీ
వములతోడ ననుచు వంత గుంది.
"నినుఁ బతిగూర్పకుండినను
నెచ్చెలిఁ గానుసుమూ మనంబునం
బెనఁగొను తాపవేదనల

బెగ్గిలఁబోవకు మన్ము యంచు న
న్ననుమతి నూఱడించుచును
ప్రాణసఖీమణి రాత్రివేళ నా
వెనుకనె పండియుండినది
వేగఁ గనంబడ దేమిమాయయో?
అనినం దల్లడపాటు నొందుచును నే
నన్నట్టులే యయ్యెనా!
వనితారత్న మదెట్టియాపదలకుం
బాలయ్యెనో? యంచుఁ దీ
ఱనిదుఃఖంబున నెల్లెడన్ వెదకి కా
ర్యం బేమియుఁ గాన కీ
యనురూపాసతితోడ నీపురమునం
దావాసముం జేయఁగన్.
చనుదెంచి యీగృహంబున
ననురూప మెలంగుచున్నదని యెవ్వరికిన్
గనుపట్టకుండ గూఢం
బున మెలఁగుచు నుంటి నేనుఁ బురుషాకృతితోన్.
అనురూప యుపన్యాసం
బును వ్రాయఁగఁగలుగునట్టి ప్రోఢ యగుట నిం
టనె యుండి వ్రాయుచుండును
చని చదివెద నేను నార్యసభలం బెలుచన్.
ధర్మోపన్యాసకుఁ డని

నిర్మలమతి యనియు మాట నేర్పరి యని న
న్మర్మిలిఁ బూజింతురు నా
మర్మ మెఱుంగరు పురంబు మనుజులు సుకృతుల్

దానఁ జేసి భారతీనందుఁ డనుబిరు
దంబు గలిగె ననినఁ దన్వి! వింటి
మాణిభద్రుఁ డెంతొ మర్యాదగలవాఁడ
టంచు నిన్నుఁ బొగడ నప్పు డపుడు.

అనవుడు మాణిభద్రుఁడు ధ
నాఢ్యుఁడు రూపమునందు వృత్తమం
దును గడుఁ బెద్ద యాతనికిఁ
బొయ్యలినా నొకజంత దాపురిం
చినది కళంకమట్టుల యి
సీ! యది యింతకు మున్న నన్నుఁగాం
చి "నను బరిగ్రహింపు"మని
చేరిన దేమన దానిచెయ్దముల్?

అనవిని మగువా! యేమియు
ననఁబోమెదు సుమ్మి యట్లు లౌరా పున న
చ్చినవాఁడ నేన యని య
మ్మనుజవిభుఁడు పలుక వింత మనమున గదురన్.

భారతి వానిఁ గాంచి నర
పాలశిరోమణీ! యేమి! రొట్టెటూ
నీరజగంధిరూపమున
నీవ తమి న్నను నట్లు సేయఁగాఁ

గోరుమహానుభావుఁడవు!
కోమలిరూపును దాల్చి యిట్లు లే
తేరఁగ నేమికారణము
తెల్పు మనం జెలి కాతఁ డిట్లనున్.
ప్రోడ! యిందాక నే నాఁడు రూపుతోడఁ
జెప్పిన కథాంశమందు నెచ్చెలిని బాసి
చనిన తరువాత కథ విన్న సకలమెఱుఁగ
వచ్చు నని తెల్పి యారత్నవర్మవిభుఁడు.

*

ఉత్తరోత్తర భాగము:
మనమున నూఱడిల్లి మతి
మంతుఁడు నేనును నాఁటిరాత్రియం
తనమున నిద్రగంటిమి గ
దా! వనమందునఁ బొన్నక్రింద నం
తన తడవైన లేక కల
తం బడి మేల్కని శోకవహ్ని నె
మ్మనము దహింప లేచి మతి
మంతునివీడి నిజేచ్ఛఁబోవుచోన్.
కలకల తెల్లవారె నెతఁ
గాంచుచు నుండిన నామొగంబునం
గలకల తెల్లవారిన ప్ర
కారము తెల్పుచు; నేను నంత ని

ర్మలతరసిరసీరజము
రాశివిరాజితమైన యొక్కచో మే
లౌ్కలకునుగాంచి సౌల్యములు
గొబ్బునఁ దీరిచి కంటి చెంగటను.
ఒకవీథి వేదపాఠకుల యధ్యయనంబు
వీనుదోయికి విందు సేయ
ఒకవీథివీరవరోచితోద్యచ్చర
వ్యాయామములు మనంబలరఁ జేయ
ఒకవీథి వివిధవర్తకమహాపణవస్తు
విసరంబు కన్నుల విందు సేయ
ఒకవీథి విలసత్కృషికగోష్ఠసంచర
ద్గోసంఘములు చాల కుతుక మిడఁగ
వివిధమణిసౌధపరిఘానపీనవేశ్మ
పంక్తు లానందమును బొందుపఱచుచుండ
ధారుణీతరుణీగళతారహార
హీరమణిఁబోలుపురి కురంగేశ్వరంబు.
కనుఁగొనుచుఁ బోవుచుండఁగ
ఘనసౌధాగ్రంబునుండి కనదంభోజా
నన యొక్తు నన్నుఁ గన్గొను
చునె దిగి వచ్చి కవుగింటఁ జొన్పుచు ననియెన్.
చిన్ననాఁటిచెలిని నన్నుఁ జూడక యిట్లు
మూఱుమొగము వెట్టి తారెదేల?

చెలిమికాఁడ! నన్ను చిన్నబుచ్చి యిఁకెందుఁ
బోవవచ్చు సౌధమునకు నడుమి.
అనుచుఁ జిన్ననాఁటి యనుపుత్త్రియైన
చంద్రరేఖ నన్ను సదనమునకుఁ
దోడుకొనుచుఁబోయి తులలేనిసత్కార
నియతిఁ గుశలమడిగి ప్రియముసేయ.
చేతమున వారకాంతల చేఁతలకును
రోసియుండియు, నప్పుడా వేసమునను
ఱొయురులఁ గననేరకయు పెచ్చు పెరుఁగుచున్న
యాఁకటికిఁ దాళకయు దాని కనుమతించి.
నాకమున కేగినను విడి
యాకులు తప్పినవి గావటంచుఁ దలఁచుచున్
దేకువ నాపగ లంతయు
నాకడనే యుండి రాత్రి యగుటయు నంతన్.
వెలవెలఁదియింట కమ్మఁగా విందుఁ గుడిచి
లలనవివిధోపచారములను గ్రహించి
శయ్యపైఁ బండి నాలవ జామువేళ
వనితఁ దప్పించుకొని లేచి వచ్చుచుండి.
క్రమమున నాయాపురములు
విమలనదులు ఘోరమైన విపినములును నం
భ్రమమునఁ జూచుచు నీనగ
రమునకుఁ జనుదెంచియుండఁ బ్రాణసఖుండున్.

మాణిభద్రుండు ననుఁగాంచి మమత నించి
కౌఁగిటను జేర్చి యానందగరిమఁగూర్చి
తనదు మందిరమునకుఁ దోకొనుచు నేగి
యచట మతిమంతువలన వృత్తాంతమెల్లం.
వినినది వినినట్లుగ నా
కును దెల్పి మనంబునందుఁ గూరిమిగదురన్
నను మతిమంతుని గూరిచి
మనకు శుభంబగుత! మిత్రమా! యని మఱియున్.
అతఁడును నాతనికంటెను
నతనినతియు నాకుఁ బ్రీతి యగునట్టులు సం
తతము నుపచారవిధు లం
చితముగ నొనరింపనుంటి చెలువునితోడన్!
అటు లుండి ధూర్త జనులం
పటుఁడ నగుచు మిత్రుమాటఁ బాటింపక చె
న్నటినై యొడినధనమును
బటుమతి నిప్పింతు మాణిభద్రునివలనన్.
ఇంటఁ దినుచుకాక తుంటరికితవుల
నింటిపైకిఁ దెచ్చి తంటబెట్టి
ధనము దోఁచుచుండె నని యేవగింపదు
సఖునిచెలువ యెట్టి సాధ్వియొకొ!
మతిమంతుండును మాణిభద్రుఁడును స
న్మార్గంబునం ద్రిప్పఁగా

సతతంబుం జెవినిల్లుగట్టుకొని స
చ్ఛం జెప్పిరే కాని నా
మతి యేమో యటు సేయ నోపకయ దు
ర్మార్గంబునం బోవుచుం
గితవాసక్తిని మానదాయె నకటా!
కీడ్పాటు వాటిల్లుటన్.
ఈరీతి ధూర్తకోటిం
జేరి చరింపంగ నొక్క చెలికాం డనె· నేం
"డోరి! విన్నారంటరా!
నారీతిలకంబు పురుషనాయకుం డగుటన్.
భారతీనందుండను పేరు వడసెనంట!
భారతియొ? నందుండో? చూచి తీరవలయు
సభల కరుదెంచునంట! యొక్క సారియైనం
జూడలేదార!" యనం గడు చోద్యమంది.
నేనే చని కనుంగొనియెద
నేనే చని కాంతు ననుచు నే నే ననుచున్
నానారీతులం గేరుచు
మేనులు పొంగార మీంది మీందికిం జనుచున్.
మీసంబులు వడివెట్టుచు
నా సరివా రెవ్వ రనుచు నా కపటకళా
భ్యాసము మీసరవోవు నె
వేసము చూచెదముగాక (వేల్మిడిననుచున్.

పంతములనిట్టు లొండొరులఁ బలుకుచుండ
నప్పుడు మతిమంతుఁ డెద్దియో స్వాంతమందు
యోచనము చేసి తల యూఁచి యుత్సుకమతి
మమ్ముఁ గని పల్కె నిట్లు దైవమ్ముపగిదిఁ
ఇట్టిపనులు చేయ నిందఱు నీతఁడు
మేలుచేయి వడయు మీరలెల్ల
వీనిఁ బంపుఁ డనుచు వెడవెడ నొప్పించు
యిట్టిరూపుతోడ నేగు మనిన,
ఆఁడురూపుఁదాల్చి యర్ధరాత్రంబున
నెట్లుపోవువాఁడ నేననంగ
వెనుకఁ గత్తిఁబూని చనుదెంతు మిత్రమా!
పరులవలన నేగి పొరయకుండ.

అని మతిమంతుఁడు న్వెనుక
నాయుధముం గొనిరాఁగఁ జీఁకటిఁ
ఘనవిపదంబుధిం బడిన
కైవడిఁ గైతవ మేర్పరించి నే
ననువుగ నింటు చొచ్చితిని
నాకపటక్రియ నేయకున్న నె
ట్లొనరుగృహంబుఁ జేర? శుభ
మొందుట యెట్టులుగల్గు స్త్రీయఁ
సూత్రధారుండు నాటక పాత్రములను
గూర్చి యొడలించి క్రమ్మరఁ గూర్చునట్లు

కలిసియుండిన మనలను గడలఁద్రోసి
నలువురను గూర్చె మద కిట్లు నలువ భళిర!
అన ననురూప సమ్మదము
నందియు విన్నదనంబుఁదోఁపఁ నా
యనుగుసుబుద్ధి యిట్టి సమ
యంబున నుండినఁగాదె పూర్ణతఁ
గను మనసంతసంబు; వృథ
గాదె సఖిమణిక్యమైనదానిఁ
ననుభవ మంద లేని ప్రమ
దాతిశయంబుఁ దలంప భారతీ.
అనిన మతిమంతుఁ "డేనెసుమా
నని యెఱింగింప నాశ్చర్యంబున మునింగి
యద్దిరా! యిదియెంత పుణ్యంబటంచుఁ
దనిసి యనురూప నిజము గన్గొనఁ దలంప.
లోని కరిగి తొంటి మానినిరూపంబు
తోడ నానుబుద్ధి తోఁచుటయును
చెలువ లామెఁ గౌఁగిళులఁ జేర్చి యలరిరి
వింత రత్నవర్మ వెలఁదిఁ గనియె.
అనురూపాసతి యానుబుద్ధిఁ గని చె
ల్వా! నీవు నాయొద్దఁ జే
సినపంతంబును దీర్చికొంటివి గదా!
సేబాసు! నీవంటిదా

నిని నాయాత్మసఖీలలామమగుచుగఁ గం
టిక్ ధన్యతం బొందితిక్
నన్నుఁ బోలంగలవారలుండరని యా
నందంబునం బొంగినక్.
భారతియున్ సఖీమణిని
బ్రస్తుతిఁజేసి లతాంగి! యప్పుడే
తీరున నీయనుంగుపడ
తిక్ విడనాడి తొలంగి యెట్టు లీ
ధారుణినాథుఁ జేరితివి?
తత్కథసర్వముఁ దెల్పుమన్న స
ద్వారిజగంధి యిట్లనియె
వారలకుం బ్రమదంబుఁ గూర్చుచుక్.

*    *

పూ ర్వో త్త రా గ్ర ము :
అపు డనురూపతోఁ బ్రతిన
లాడి క్రమంబున నెట్టులైన నా
నృపతిని దెత్తునంచు మది
నెంచుచు నద్దమరేయివేళ నా
నెపమున నీమెఁ బాసి చని
నేనొకపూరుషవేష మూని ని
ష్కపటమతిన్ బ్రతాపపురిఁ
గన్గొని యీతని చెల్మి చేసితిన్.

ఇతఁడు వారకాంతయే తనప్రాణంబు
ధనము రాజ్యమనుచుఁ దలఁచుచుండి
నిరతమును ధనంబు దొరలించుచుండుటఁ
గాంచి యొప్ప కొక్క కాలమందు.
మంత్రివరులఁ జేరి మంతనంబునఁ బిల్చి
చదురుజేసి "యేల చతురులార!
యూరకుంటి రిట్టు లుర్వీధవుండు సిరి
వేదురత్తి కొల్ల వెట్టుచుండ.
ధారుణీ జనులకు నృపుఁడా
ధారుం డగుఁగాన నతఁడు ధర్మిష్ఠుఁడై
గోరుచు రట్టిఁడ ప్రభుఁ డని
గౌరవమున్ బడయుఁ; దగవు గలదే? యితనికిన్.
నిను రాజుగాఁగఁ బృథివీ
జను లొప్పకయుండ రింకఁ జాలును వారాం
గనఁ జేరు మనుచు నొక నెప
మున గుంజుకొనుండు రాజ్యముల్ బలిమిమెయిన్
అని యాతని కుపకారం
బును గూర్పఁగ వారి కట్లు బోధించిన నా
నని యట్లు సేయ రాజ్యం
బును బాసిన యితనికోడఁ బోవుచు నొకచోన్.
ననుఁ గిరుకువెట్టి చనుసీ
మనుజవిభుని నెట్లుగాంతు మాయురె! యని నె

మ్మానమునఁ గలంత నొందుచు
గనుఁగొన వచ్చితిని యీశ్రీకాకుళమునకుఁ.
మాణిభద్రుఁ డెంతో మర్యాదగలవాఁడ
టంచు రత్నవర్మ కాప్తుఁ డనుచు
నెఱిఁగి యెల్లచరిత మెఱిఁగించి యంగుండ్ర
వచ్చె నితఁడు కొన్ని వారములకు.
నరపతిఁ గూడి భారతియు
నందుఁడొ మాత్రముగా కటంచువా
రరుదుగ వాదులాడు సమ
యంబునఁ బల్లియఁ జేరి నాఁడు ము
వ్వురమును బూరుషాకృతులఁ
బూనఁగ నెంచుట దోఁచి భారతీ
తరుణియె యిట్టులుండుఁ జెలి
దగ్గఱ నంచును వీనిఁ దెచ్చితిన్
పురుషకారంబునకు దైవమును ఘటిల్లి
మంచికాలము రా సమీపించునపుడు
మనుజులొనరించుకొద్ది యోచనలుగూడ
నెంతొ మేలొనగూర్చుట కిదియె సాక్షి.

సర్వాగ్రముః
ఈవిధి నొండొరుల్ తెసు యి
భీప్సితసిద్ధికి మూలమైన ప్ర

స్తావకథాభిధాన మవ
ధానము సేయుచు నద్భుతప్రమో
దావిలచిత్తులై చెలఁగు
నంతఁ దదీయ విపత్పరంపరా
భావము వోల్చి రేచనఁ బ్ర
భాతము దోఁచ ననంతరంబునన్.
పురజను లీయద్భుతరస
భరితం బగుచరిత వెఱఁగి పరమానందా
దరమేదురమతిఁ బొగడిరి
తరుణిం దత్పతుల ధర్మతత్పరమతులన్.
అది విని మాణిభద్రుఁడు ము
దాతిశయంబునఁ బొంగి నెచ్చెలిం
గదియఁగ వచ్చి వానివల
నన్ శుభసంగతమైన యక్కథన్
మొదలిటినుండియున్ విని యు
పూర్వ మదృష్టము మీసమాగమం
బిది యని ప్రస్తుతించి యతఁ
డెల్లరఁ దోడ్కొని యేగె నింటికిన్.
విందులు గుడుచుచు వారా
మందిరమున్న నుండ నతని మంత్రు తెఱఁగి యూ
నఁడెఱిబునఁ జనుదెంచి ర
మందగతిన్ రత్నవర్మ మన్ననఁ బడయన్.

వారల నాప్రతాపజన
పాలుఁడు సాదరగౌరవంబులన్
జేరఁగఁ దీసి మన్ననలు
జేసి యెఱుంగఁగవచ్చె వీర లా
తీరునఁ జేసినార మని
దీనతఁ బొందకుఁ డంచుఁ దెల్పి యా
కూరిమి మిత్రుతో నతని
కోమలితోఁ బరివారయుక్తుఁడై.
కతిపయవాసరములకుం
బ్రతాపపురిఁ జేరి పట్టభద్రుం డగుచున్
సతి యనురూపాంగనతో
క్షితి నేలుచుఁ దన్ను ప్రజలు చేరి నుతింపన్.
మణిభద్రు నతని మానిని మణిమాల
నెన్నరాని ప్రేమఁ గొన్నినాళ్ళు
తనదు మందిరమునఁ దనిపి కృతజ్ఞత
నెఱుఁగఁ జెప్పి కానుక లిచ్చి యనిపి.
తనరాజ్యమున వారతరుణీవిహారంబు
పొడచూప రాకుండఁ బొందుసేయ
తనయేలుబడిని దుంటరిమార్గములఁ బోవు
ద్యూతకారులపెంపు దొలఁగఁ జేయ
తనపరిపాలనంబున నేకపత్నీవ్ర
తము పూరుషులకు ధర్మముగఁ జేయ
తనయధికారంబునను మహిళాకళా
భ్యుదయంబు నెల్లెడఁ బొదలఁ జేయుఁ

దలపుఁగొని యెల్లవిధముల మెలపుతోడఁ
బొలుపునం దచమతమును నిలుపుకొనుచుఁ
దలపుఁబడి రాజులెల్ల మొక్కలపుఁబ్రేమఁ
దెలుపుకొన రాజ్యలక్ష్మిపై వలపునిలిపి.
కరము కరముఁ గొనక కడు కృపామతితోడ
నేలనేల సాధు శీలమునను
బ్రజలు ప్రజలువోలెఁ బ్రభుభక్తియుతులైరి
రాజు రాజువోలెఁ దేజరిల్లె.

*

గద్య పద్యము

శ్రీలాంధ్రకులచైత్ర వనపారిజాతుండు,
నోలేటివంశపయోధివిధుఁడు
నారసింహామాత్యనందనుం, డచ్యుత
రామమంత్రీశ్వర ప్రథమసుతుఁడు
సూరమాంబాగర్భ శుక్తిముక్తామణి,
వేంకమాంబాదాన విమలఫలము
అమలధనాభిరామాదినాటకకర్త,
స్వర్ణమాలాదిరూపకవిధాత
యైన వేంకట పార్వతీశాఖ్యసత్క-
విద్వితయకృతలసమాన విపులపద్య
లలిత "చిత్రకథాసుధాలహరి" నామ
చిత్రతరకల్పనాకావ్య శేఖర మిడి.
సమగ్రము.